THE

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

DEBATES.

*[Part II—Proceedings other then Questions and Answers]*

OFFICIAL REPORT.

---

*Thirtyeth day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly.*

---

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY.

*Tuesday, the 25th February, 1958.*

The House met at Two of the Clock.

*[Mr. Speaker in the Chair]*

QUESTIONS AND ANSWERS.

(See Part I)

## Announcement Re: Expunging of certain words from the Proceedings of 21st August, 1956 of Andhra Assembly.

మిస్టర్ స్పీకర్:— ఈ నెల 9-2-57 వ తేదీన, ఆంధ్రప్రదేశ్ ఆర్య వైశ్యమహాసభవారి వద్దనుంచి కర్నూలులో ఆంధ్రస్టేటు ఎసెంబ్లీలో ఒక గౌరవసభ్యుడు తమ సంఘానికి అవమానకరంగా మాట్లాడారు గనుక దానికి సంబంధించిన మాటలు ఎసెంబ్లీ ప్రొసీడింగ్సులో నుంచి తీసివేయమని నాకు ఒక అర్జీ వచ్చింది. ఆమాటలు proceedings నుంచి తీసివేయటానికి నాకు అధికారము ఉన్నది. ఎందుకంటే, ఈఎసెంబ్లీ కర్నూలుఎసెంబ్లీ యొక్క continuation యే గనుక స్పీకరుగా నాకు అధికార మున్నది. ఆమాటలు ఏమిటో నాకు తెలియదు. అది proceedings లో ప్రచురించారో లేదో నాకు తెలియదు. గనుక నేను అవి చూడనిదే ముందుగా తీసివేయను అని నేను వారికి చెప్పాను. మరల మొన్న ఈమధ్య అనగా 20-2-58 వ తేదిన ఆ proceedings copy ని తీసుకొనివచ్చారు అందులో అసభ్యమైన మాటలు వున్నవని నేను నిర్ణయించాను. ఆ proceedings లో రెండవది ఇంకొక విషయముకూడ ఉన్నది. వైశ్య సంఘానికి వ్యతిరేకముగ కొన్నిమాటలు ఉన్నవి. బ్రాహ్మణ సంఘానికి వ్యతిరేకముగకూడ ఉన్నట్లు, ఇంకొకరు దానిని retort చేసినట్లు ఉన్నది. ఆవిధముగా అసభ్యమైన మాటలు మాట్లాడిన సభ్యులపేర్లు నేను ఇక్కడ చెప్పనక్కరలేదు. అవిసరియైన మాటలుకావు గనుకను ఒకవేళ ఆమాటలు వైశ్య సంఘానికి కాకపోయినను వర్తకసంఘానికి అవమానకరముగ ఉన్నది గనుకను, అలాంటిమాటలు ఏసంఘాన్ని అయినా అవమానకరముగ మాట్లాడటము మంచిది కాదు గనుక, ఎసెంబ్లీ రూల్సులోని 25వ రూలు ప్రకారము నేను ఆమాటలు ఆదినము proceedings లో నుంచి తీసివేయటానికి ఉత్తరువు చేశాను. అందువల్ల ఈవిషయము ఈనాటి ఎసెంబ్లీలో నేను announce చేస్తున్నాను. ఇంతకంటె దీనినిగురించి ఎక్కువగమనము మాట్లాడుకో నవసరములేదు.

ఆర్థికమంత్రి (డాక్టరు బి. గోపాలరెడ్డి).-Mr. Speaker Sir, ఇప్పుడు ఆ proceedings print అయినవా లేదా?

మిస్టర్ స్పీకర్:—ప్రింటు అయినవి.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—Print అయిపోయియుంటే, యిప్పుడు వాటిని ఏమిచేస్తారు? ఎట్లా తీసివేయటానికి వీలు అవుతుంది?

మిస్టర్ స్పీకర్:—Print అయినా కూడ ఆమాటలను ఆ proceedings లో నుంచి expunge చేయవచ్చు. చేయటానికి నాకు అధికారము ఉన్నది.

డాక్టరు బి. గోపాలరెడ్డి.—అధికారమున్నది సరే. అవి యిప్పటికి మెంబర్లకందరికీ distribute అయిపోయినవికదా? అందరూ చదువుకునే ఉంటారు.

మిస్టర్ స్పీకర్:—Distribute అయిపోయినదానికి నేనేమి చేయను?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— కాబట్టి, ఇప్పుడు, ఈ స్థితిలో వాటినిఎట్లా expunge చేస్తారు ?

మిస్టర్ స్పీకర్:— ఆవిషయమే ఆ proceedings లో వ్రాస్తాము. దానిని గురించిన రూలు చదువుతున్నాను.

"251. **Expungung of words.**—If the Speaker is of opinion that a word or words has or have been used in debate which is or are defamatory or indecent, or unparliamentary or undignified, he may, in his discretion, order that such word or words be expunged from the official report of the proceedings of the Assembly, and all consequential alterations made in such report and make an announcement in the Assembly of the fact of his having made such order."

తరువాత expunge చేసినట్లుగా చేయటానికి ఉన్న proceedure ఎట్లాగో అదికూడ చదువుతున్నాను.

"52. **Indication in printed debates of expunged proceedings.**—The portion of the proceedings of the Assembly so expunged shall be marked by asterisks and an explanatory footnote shall be inserted in the proceedings as follows :—

"Expunged as ordered by the Chair".

అందువల్ల proceedings print అయిపోయినప్పటికిని పై విధముగ చేయవచ్చును.

*Dr. B. Gopala Reddi :* All that can be done only before we get the proceedings printed.

మిస్టర్ స్పీకర్:—No. No. Print అయినతరువాతనే గాని, print కాకముందు ఏమి లేదు. Proceedings distribute అయిఉంటే చదువుకున్నవారు ఉన్నప్పటికినీ ఆ protion of the proceedings expunge చేశాము అని తెలియ జెస్తాము. అది వారికి తృప్తిపరచినట్లు అవుతుంది. దానివల్ల మనకువచ్చేదిలేదు. పోయేదికూడ ఏమీలేదు.

శ్రీ బసవ మానయ్య (అందోలు):—అధ్యక్షా, ఆపదాలు ఏవో, వాక్యాలుఏవో మాకు తెలియ జేయాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్:— చెప్పవలసిన అవసరంలేదు కనుక చెప్పను.

శ్రీ కె. యల్. నరసింహారావు (ఎల్లందు-జనరల్):—అసెంబ్లీలో ఆ వ్యవహారం జరుగుతున్నప్పుడు మాత్రమే అవి unparlimentary words అని స్పీకరుగారు భావించినట్టయితే expunge చేయించడానికి అధికారం ఉంటుంది. కాని అట్లాకాకుండా దీర్ఘకాలం గడచిపోయిన తరువాత, print అయిన proceedings లోనుంచికూడా expunge చేయించేందుకు అధికారం ఉన్నదా అని నాకు అనుమానంగా ఉన్నది.

మిస్టర్ స్పీకర్:— అధికారం ఉన్నది అని చెప్పాను. ఇంక యీవిషయమై ఎవ్వరికీ అనుమానం ఉండకూడదు.

శ్రీ ఎస్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం-జనరల్):—కనీసం ఆమాటలు ఎవరుఅన్నారో చెప్పకోర్తాను.

మిస్టర్ స్పీకర్:—అదంతా సభికులకు చెప్పనక్కరలేదు.

శ్రీ ఎస్. కె.వి. కృష్ణావతారం:—సభవారికి తెలియకపోతే ఎట్లా?

మిస్టర్ స్పీకర్:— నేనుఇట్లా చేశాను, అనిసభలో తెలియ జేయడమే తప్ప తబ్సీళ్లు అన్నీ చెప్పనవరంలేదు.

శ్రీ ఎస్.కె.వి. కృష్ణావతారం:—కనీసం అప్పుడు ఉపయోగించిన మాటలయినామాకు తెలియ జేయకపోతే మళ్లీ అదే mistake repeat అయ్యే అవకాశం ఉన్నది.

What are those words and utterances that are considered to be objectionable and that are to be expunged?

మిస్టర్ స్పీకర్:— వైశ్య సంఘానికి వ్యతిరేకంగా కొన్నిమాటలు అన్నారు. ఇంకొకరు వాటిని retort చేస్తూ బ్రాహ్మణ సంఘానికి వ్యతిరేకమైన మాటలు మాట్లాడారు. ఆరెంటినీ expunge చేస్తున్నాము. అంతకంటె ఏమీలేదు.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి (నెల్లూరు):—ఆమాటలు ఉపయోగించిన నాడా అసెంబ్లీ స్పీకరు మీరేనా? ఇంకొక స్పీకరు time లో జరిగిన వ్యవహారాలను మీరు యిప్పుడు expunge చేయించడం మంచిదా?

మిస్టర్ స్పీకర్:— అధికారం ఉన్నది కనుక ఉపయోగించాను.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి:— నేనడిగేది మీ అధికారం విషయంకాదు. 'మంచిదా'? అని అడుగు తున్నాను.

మిస్టర్ స్పీకర్.— మంచిదే.

శ్రీ పి. నరసింగరావు (హుజూరునగర్-జనరల్):- ఆ మాటలు ఏమిటో నాకు తెలియజేసి నట్లయితే మీ దగ్గరవున్న proceedings లోని ఆ మాటలను strike చేసుకుంటాము. కాబట్టి అవేవో చెప్పినట్లయితే బాగుంటుంది.

## Paper laid on the Table of the House.

*Amendments to Rules 148. B and 316 of the Madras Motor Vehicles Rules 1940*

*The Minister for Revenue (Sri K Venkata Rao) :-* Mr. Speaker, Sir, I beg to lay on the table of the House, under Section 133 (3) of the Motor Vehicles Act, 1939 (Central Act IV of 1939), a copy of the Amendments to Rules 148-B and 316 of the Madras Motor Vehicles Rules, 1940, published at pages 201-202 and page 202 respectively of the Rules Supplement to Part I of the Andhra Pradesh Gazette dated the 12th December, 1957.

*Mr. Speaker :-* Paper laid on the Table.

## Business of the House.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు (నందిగామ):—ఆన్ ఎ పాయింటు ఆఫ్ ఇన్ఫరమేషన్, సర్ రేపు బడ్జటు ప్రవేశపెట్టబోతున్నారు. ఇది వరకున్న సాంప్రదాయం ప్రకారంగా బడ్జటు ప్రవేశపెట్టిన తరువాత రెండు, మూడు రోజులు అసెంబ్లీ పనిచేసేదిలేదు మద్రాసులోనూ, కర్నూలులోనూ అట్లాగే జరిగింది. క్రిందటి సంవత్సరం ఆంధ్రప్రదేశ్‌లో బడ్జటు సమావేశంలో కూడా అదే సాంప్రదాయాన్ని పాటించడం జరిగింది. రేపు బడ్జటు ప్రవేశపెట్టిన తరువాత general discussion ప్రారంభించే వరకూ అసెంబ్లీ సమావేశమును వాయిదా వేయడం జరుగు తున్నదా? ఇది మేము ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయం. ఒకవేళ అసెంబ్లీ పనిచేసేటట్లయితే 100 పేజీలుగల బడ్జటు అంతా చదివి మొదటిరోజున debate ప్రారంభించడం చాలా కష్టమైన విషయం. ఉమ్మడి రాష్ట్రంగా వున్నప్పుడు మద్రాసులోనూ, ఆంధ్రరాష్ట్రంతో కర్నూలులోనూ, క్రిందటిసారి హైదరాబాదులోనూ కూడా 4 రోజులు వ్యవధినిచ్చే సాంప్రదాయాన్ని పాటించాము. ఇదివరకు హైదరాబాదు అసెంబ్లీలోకూడా యిదే సాంప్రదాయం ఉండేదని మిత్రులవలన తెలుసు కున్నాను. కాబట్టి రేపు ఏమి చేయబోతున్నారో తెలియజేయాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్:— Business Advisory Committee లో శ్రీ సుందరయ్యగారు, రామకృష్ణరాజుగారు ప్రభుత్వ ప్రతినిధులు అంతా వుండగా యీ విషయమై చర్చించినాము. చాలా Bills ఉన్నాయి కనుక 27, 28 తేదీలలో కొంతసేపు కూర్చుని Official work చేయడానికి నిర్ణయించినాము. నేను యిప్పుడు ఆ ప్రకారం చేయవలసినదేకదా! ఒకవేళ అట్లా తీర్మానించుకొనకపోయినట్లయితే, 27, 28 రెండు రోజులూ ఆట విడుపు చేయడానికి నాకు అభ్యంతరంలేదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— ఆటవిడుపుకోసం కాదు మేము అడుగుతున్నది. బడ్జెట్ ప్రవేశపెట్టిన తరువాత దానిని study చేసి మొదటి రోజుననే కొంతమంది మాట్లాడవలసిన అవసరం ఉంటుంది. అందువల్ల యిక్కడ బిల్లులకోసం అసెంబ్లీకి హాజరయి, 7 గంటలవరకూ వుండి ఆ budget ను study చేయడం సాధ్యపడే విషయంకాదు. కాబట్టి బడ్జటు ప్రవేశపెట్టిన తరువాత యధావిధిగా రెండురోజులు సభ్యులకు విశ్రాంతి కలుగజేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను. లేకపోతే చాలా చిక్కులకు లోనుకావలసి వస్తుంది.

ముఖ్యమంత్రి (శ్రీ ఎన్ సంజీవరెడ్డి) .— అధ్యక్షా, అసెంబ్లీవుంటే రోజుకు 3,4 గంటలు పనిచేస్తాము. మిగిలిన కాలంలో చదువుకోడానికి వ్యవధి వుంటుంది. ఆ రెండు రోజులలోనూ ముఖ్యమైన బిల్లులు రాబోతున్నాయని సభ్యులకు తెలుసును. Business Advisory Committee లో నిర్ణయించుకున్నాము. అప్పుడు కోరుకొని యీ విషయాన్ని యిప్పుడు తేవడం మంచిదికాదని నా ఉద్దేశం ఈ విధంగా చేస్తూంటే It becomes purposeless. అసలు meetings అనవసరం అయిపోతాయి.

మిస్టర్ 'స్పీకర్.—ఈ విషయం Business Advisory Committee లో నిర్ణయించబడినది. దాని ప్రకారం, 27, 28 తేదీలలో కూడా మామూలుగానే అసెంబ్లీ పనిచేస్తుంది. సభ్యులు ఉదయంపూట, రాత్రిళ్లు చదువుకోవచ్చును. 1 వ తేదీన అసెంబ్లీ పనిచేస్తుంది 2 వ తేదీ సెలవు 3,4 తేదీలలో సాధారణ చర్చ సాగించవచ్చు. మళ్లీ 5,6 తేదీలు సెలవు. 7 వ తేదీన పని చేస్తుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— ఒకటవతేదీన meeting లేకుండాచేస్తే మాకు చదువుకోడానికి కొంతవరకు time ఉంటుంది. Business Advisory Committee లో నిర్ణయించినప్పటికీ యీ బిల్సు అన్నీ రెండు రోజులలో ఎట్లాగూ పూర్తికావు. ఇంకా కొన్ని బిల్లులు మాచేతికి రాలేదు.

మిస్టర్ స్పీకర్ —మీరు యీ విషయం చాలా ఆలస్యంగా చెబుతున్నారు. కాబట్టి దానిని గురించి నేనేమీ చేయలేను.

This is what is recorded in the Report of the Business Advisory Committee.

"The Business Advisory Committee decided that on 27th and 28th February, 1959 official business can be transacted."

Therefore, the Business Advisory Committee has already decided and I have to act according to that. So, I have to tell the hon. Member Mr Pillalamarri Venkateswarlu that on 27th and 28th February, 1958 also official business shall be transacted in the afternoons.

రేపు మూడుగంటలకు సమావేశ మవుతాము. 4 గంటలవరకు ప్రశ్నలకాలం. 4 గంటలకు బడ్జెట్ ప్రవేశ పెడతారు 27,28 తేదీలలో మాత్రం Business Advisory Committee నిర్ణయించిన ప్రకారమే జరుగుతుంది.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— Business Advisory Committee ఆ ప్రకారం చేసినా- Question hour ను లేకుండాచేస్తే మాకు కొంచెం వ్యవధి వుంటుంది. లేకపోతే చాలా చిక్కులతో అవస్థ పడవలసి వుంటుంది. అందువల్ల Question hour ను తీసేసి 4, గంటలకు బదులు 7 గంటలు పెడితే బాగుంటుందని సూచిస్తున్నాను. ముఖ్యమంత్రిగారు యీ విషయం ఆలోచించాలని కోరుతున్నాను.

శ్రీ కె. ఎల్. నరసింహారావు:— ఇప్పుడు దాదాపు 11 బిల్లులకు ప్రభుత్వంవారు నోటీసులు యిచ్చారు. అందులో కొన్ని ఆంధ్ర చట్టాలను పూర్తిగానూ కొన్నింటిని partial గానూ తెలంగాణా ప్రాంతానికి వర్తింప చేస్తున్నారు. అసలు మాకు ఆ Acts ప్రతులు లభించడంలేదు.అంతేకాక, ఇక్కడ యాక్టులోఏమివున్నదో, అక్కడ యాక్టులోఏమివున్నదో Comparitive గా మాకు చెప్పగలిగిన స్థితిలో లేదు ప్రభుత్వం. 11 బిల్లులను గెజిట్‌చేశారు మాకు 5, 6 రోజులు వ్యవధి మాత్రమే యిచ్చారు. ఇందువల్ల మేము ఆ Acts నూ, యీ Acts నూ, study చేయకుండా మమ్ములను యిరికించి స్వల్పవ్యవధిలోనే యీ వ్యవహారమంతా చేసుకోడానికి ప్రయత్నిస్తున్నట్లు కన్పిస్తున్నది. అందువల్ల, యీ బిల్లుల వ్యవహారంలో మేము studyచేసి అర్థం చేసుకోవలసిన విషయాలున్న కాగితా లన్నింటినీ ప్రభుత్వంమీద ఒత్తిడిచేసి అయినాసరే మాకు యిప్పించెదరని ఆశిస్తున్నాము. మేము Compartive గా study చేయవలసిన వాటినన్నింటినీ మాకు యిప్పించాలి. అట్లా యిప్పించక పోతే మేము Oppose చేయడమే కనబడుతుంది తప్ప——స్పష్టంగా అర్థంచేసుకొని, విమర్శించ డానికిగాని, సమర్థించడానికిగాని, అవకాశం లేకుండాపోతున్నది ఆంధ్ర చట్టాలను, హైదరాబాదుకు వర్తింప జేయడంలో పూర్తిగా చేసినా—— partial గా చేసినా—— మాకు ఆ చట్టాలను supply చేయించాలి. మేము Comparitive గా study చేయవలసిన అవసరం ఉన్నది. ఈ విషయమై మంత్రిగారు సానుభూతితో ఆలోచించాలి. స్పీకరుగారు కూడా తగినంత ఒత్తిడిచేసి యిప్పించాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్:- ఒత్తిడి లేకుండానే తీసుకు వస్తారని నానమ్మకం.

శ్రీ కె. వెంకటరావు:—మార్పులుచేసిన Comparitive statement సభ్యులందరికీ పంచిపెట్టబడినది. Concerned sections ఉన్నాయి.

శ్రీ కె. ఎల్. నరసింహారావు:— Andhra Act ను యీ ప్రాంతానికి వర్తింప జేస్తున్నారు. ఇక్కడ Act ను repeal చేస్తున్నారు. అట్లా repeal చేయడంవల్ల మాకు నష్టం కలుగుతున్నదో, లాభం కలుగుతున్నదో—అనే విషయం మా ముందరలేదు. ఇవి చాలా పురాతన మైన చట్టములు. ఎక్కడైనా డిపార్టుమెంట్సులో ఒక Copy వుంటుందేమో. అంతేకాని యిక్కడక apply చేయబోయే Act కూడా మాదగ్గర లేదు. కొన్ని sections మాత్రం మాకుయిచ్చి 'మేము Comparitive గా యిచ్చాము, చూసుకోండి, అంటే సరిపోదు. దానివల్ల ఎట్టిమార్పులు జరుగు తున్నాయో మాకు తెలియడంలేదు.

శ్రీ కె. వెంకటరావు :—అది అసంభవమైన విషయం. ప్రభుత్వమే ఖరీలో చూసుకోవలసినదే. అక్కడా యిక్కడా integrate చేయవలసినచట్టములు ఒక్క రెవిన్యూశాఖలోనే 142 వున్నాయి. ఈ 142 చట్టములకు సవరణలు వచ్చేటప్పుడు మరల అక్కడి చట్టములను యిక్కడి చట్టములను పూర్తిగా అచ్చువేయించి circulate చేసి శ్రీ నరసింహారావుగారు చెప్పినట్టుగా వ్యవహారం జరుపవలసివుంటే ఇంకో 5 సంవత్సరముల తరువాత అనగా వచ్చే శాసనసభలో మొదలు పెట్టవలసినదే గాని యిప్పుడు జరిగేదికాదు. అంతేకాక, ఏ ఏ Section వల్ల ఏమార్పులు, effects వస్తాయో ప్రతి బిల్లు సందర్భంలోనూ ప్రచురింప బడుతున్నాయి. ఇది ఒక research study లాంటిది. 1802 వ సంవత్సరములో జారీఅయిన పర్మనెంటు సెటిల్మెంటు ఆర్డరును revoke చేస్తున్నాం అని బిల్లుపెడితే 1802 వ సంవత్సరము నుంచి యిప్పటివరకూ జరిగిన legislation ను మళ్ళీ అచ్చువేసి ప్రతి bill సందర్భంలోనూ యివ్వడంకంటే అసలు యీ legislation నుంచి తప్పించుకోవడం మంచిది. క్రొత్తచట్టాలు పెట్టుకోడం మంచిది అందుచేత దానికి కొంత పరిమితివుంది. గౌరవసభ్యులు కూడా తమంతటతాము లైబ్రరీలో అన్నీ చదువుకోవాలి. మంత్రిగారికి మాత్రం చదువుకోడానికి ఎక్కడనుంచి వస్తున్నాయి ? మంత్రిగారి యింటిదగ్గర ఇవన్నీలేవు. ఏవోకొన్ని Codes వున్నాయి. అవి చదువుకొని వ్యవహారం చేసుకోవాలి. ప్రతిబిల్లు విషయంలో 314 కాపీలు మళ్ళా అచ్చువేసి circulate చేయాలనే general request ను ప్రభుత్వం అంగీకరించడానికి వీలుండదని మనవిచేస్తున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు.— మంత్రిగారు చెప్పినట్లు Act అంతా పూర్తిగా అచ్చువేసి circulate చేసేపద్ధతి చాలా కష్టమైన విషయమే. కాని Andhra Acts కు సంబంధించినంత వరకు annexur es మాత్రమే యిస్తున్నారు. అందులో కొన్ని Hyderabad Acts కు repeal చేస్తున్నాం అంటున్నారు. వాటి మంచి చెడ్డలు యేమిటో తెలిసికోలేకుండా వున్నాం. కనీసం annexures అయినాయిస్తే బాగుంటుంది. Hyderabad Act ఫలానాది repeal అయిపోయిందన్నారు. ఏ కారణాలవల్ల అదివనికిరాక Andhra Act తీసుకువచ్చామో తెలుసుకోడానికి చాలా కష్టంగావుంది. Hyderabed Act కు సంబంధించినవైనాసరే Andhra Act in original, దానిసవరణలతో కూడిన annexures ఏ విధంగా యిస్తున్నారో అదేవిధముగా తెలంగాణా ప్రాంతంలో వున్న existing provision యిస్తే చూసుకొని ప్రభుత్వం ఎందువల్ల మార్పు తెచ్చిందో అర్థం చేసుకోడానికి వీలుంటుంది. ఈ చిక్కు మనకు Court Fees Act సందర్భంలో ఖచ్చితముగా అర్థమైనది. శ్రీ గోపాలరెడ్డిగారు 'కర్దారు'అని 'హాళీ'అని చెప్పడంవల్ల చాలా పెద్ద confusion లోకి దిగిపోయింది. అందువల్ల యేమి జరిగిందో తెలియకుండా వుండేస్థితి మన శాసనసభకు రావడం మంచిదికాదు. హైదరాబాదు చట్టములలో వుండే existing provisions——

శ్రీ కె. వెంకటరావు:— Hyderabad basic Acts అన్నీ ఉర్దూలోవున్నాయి.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—ఇంగ్లీషులోకూడా వున్నాయి

శ్రీ కె. వెంకటరావు·— అవి ఇంగ్లీషులోచేసిన అనువాదాలు మాత్రమే. The Courts have not adapted them as basic translations. వారికి చాలు అనుకుంటే మిగతా గౌరవసభ్యులకు సరిపోదు. ఆ Codes యొక్క ప్రతులు నాదగ్గర 6 సంపుటములున్నాయి. నేడు అవన్నీ amend కావలసినదే. సవరణ యేమీ లేకపోయినా అక్కడా యిక్కడా, Act ఒకటయిపోయిందనే

బిల్లు అయినా పెట్టుకోక తప్పదు. అంతేకాక, లైబ్రరీలో అవన్నీ వున్నాయి అక్కడ కొంతసేపు కూర్చోవాలి. నేను మంత్రికాక పూర్వం సభ్యునిగా వున్నప్పుడు ఆ పనిచేసేవాడిని. అది వెంకటేశ్వర్లు గారికి తెలుసును. ఇద్దరము ఒక ప్రక్కనే కూర్చొనే వాళ్ళము సభ్యులు లైబ్రరీలోని పుస్తకాలను ఇంటికి పట్టుకొని వెళ్ళి చదువవచ్చు. దానికిగురించి కృషి చేయాల గాని మొత్తం అంతవ్యవహారాన్ని ఆపుచేయడం న్యాయంకాదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు.—వ్యవహారంఆపుచేయాలని గాని ఆలస్యం చేయాలని కాని ఉద్దేశ్యము మాకులేనేలేదు. ఇవ్వాలే నారీబిల్లులన్నీ pass చేయాలంటే pass చేయండి. మాకు అభ్యంతరంలేదు. వారెంతోమంది ఉన్నారు. ఎప్పుడయినా అవి pass కావలసినదే. అందువల్ల మాకువచ్చే నష్టంకాని, కష్టంకాని లేదు. ఆ సమస్యకానేకాదు ఏదయినా బిల్లువచ్చేటప్పుడు శ్రీ కళా వెంకటరావుగారు ఏ విధముగా చదివారో ఆ విధముగానే చదువుకొని pass చేయాలనే అత్రుతతో చెప్పాను. Act అంతా యివ్వమనడంలేదు Corresponding sections ఇంగ్లీషులోనే యివ్వ వచ్చును. కోర్టుకుపోయే బాషకాదుగదా ? హైకోర్టుకుపోయి "మీరుయిచ్చిన annexure లో యిట్లావుంది కాబట్టి, వర్తింపచేయండి" అని చెప్పేదికాదు. Hyderabad position ఎట్లా వుందో అర్థం చేసుకోడానికి మాకివ్వమని మాత్రం అడుగుతున్నాను శ్రీ ఎక్బోటేగారు "మా చట్టం మంచిది" అని చెప్పినారు. మరొక మిత్రుడులేచి, "మా Act లో వున్నది చాలా సవ్యంగా వుంది, ఆ position కంటెబాగుంది" అన్నారు అట్లాంటప్పుడు ఎట్లా సమన్వయం చేయుడం. అందుచేత అర్థంచేసుకోడానికి అడిగాము అంతేకాని నాలుగురోజులు వాయిదా వేయడంవల్ల మాకేదో ఒరిగి పోతుందనుకోవడం చాలా పొరపాటు. ఈ దృక్పథం ప్రభుత్వానికుండాల్సిన పనిలేదని చెబుతున్నాను. రాత్రి కూర్చుని pass చేద్దాంఅంటే pass చేద్దాం. తరువాత యింటికి వెళ్ళి చదువుకుంటాం.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:— (సత్తెనపల్లి) అధ్యక్షా, ఈ చట్టాలలో అనేకచోట్ల అనేక మార్పులు వచ్చినాయి. అసలు original copies దొరకడంలేదు. ఉదాహరణకు Code ప్రతులు 5 మాత్రమే లైబ్రరీలో వున్నాయి. తగినన్ని ప్రతులులేని కారణంగా అందరికీ అందుబాటులోలేవు. చివరకు వారిచ్చిన annexure మీద ఆధారపడవలసి వస్తున్నది. Clause వారీగా correct గానే యిస్తున్నారు కాని, మొత్తం బిల్లులో ఏ section కు ఏ section కు సమన్వయంవుందీ. చూసు కోవాలంటే ఆ Code ప్రతులు కావలసినన్ని లేవు. రెవిన్యూబోర్డుకు సంబంధించిన ప్రతి ఒకటిలేదు. వాటిని సమన్వయం చేసేవరకూ ఆగమని చెప్పడంలేదు. దానికికావలసిన సౌకర్యాలు వెంటనేకల్పించాల్సిన అవసరం వుందని మనవిచేస్తున్నాను.

శ్రీ బసవమానయ్య:—అధ్యక్షా, మొన్న Motor vehicles Act విషయంలో ఆంధ్ర చట్టం రావడంవల్ల తెలంగాణాలో ఏమార్పు వచ్చి ఎంత ఎక్కువ పన్ను వస్తుందో చాలా విపులముగా చూపించారు. అదే విధముగా ప్రతి తెలంగాణా చట్టం మార్చేటప్పుడు ఆ మార్పువల్లవచ్చే ఫలితాలు యింతమట్టుకేనని తెలిపేవివరాలు యిస్తే సరిపోతుంది. ఆ విధముగా చేయాలని మనవిచేస్తున్నాను.

శ్రీ పి. నరసింగరావు:— సమన్వయం చేయవలసిన చట్టాలున్నప్పుడు ఒక Law Committee ని వేసి ఆ కమిటీ పరిశీలన జరిపిన తరువాత శాసనంతెస్తే చాలాబాగుండేది. అట్టి కమిటీని వేయడానికి నిరాకరిస్తే కనీసం సమన్వయం కావలిసిన చట్టాలు ప్రతులయినా అందజేయాలి.

అది చేయకపోతే మేము legislation కు న్యాయం చేసినవాళ్ళం కావడంలేదు. వాటి ప్రతులకై లైబ్రరీలో వెదకినా దొరకడంలేదు. శ్రీ కళావెంకటరావుగారు 120 రెవిన్యూ Act లున్నాయన్నారు. ఇవన్నీ హైదరాబాదు చట్టాలను repeal చేస్తాయి. హైదరాబాదు చట్టాలన్నీ పనికి రావనే మేము భావించాలా? పనికి వచ్చినవయితే వాటిలోని మంచివి ఎట్లా repeal చేస్తారు?

శ్రీ కె. వెంకటరావు:—ఒకఅన్యాయమైన పదం ప్రయోగించారు. హైదరాబాదు చట్టములన్నీ తీసివేయడంలేదు. ఆంధ్రచట్టాలలోని కొన్ని provisions ను వాటిలోయిమిడ్చే రెండింటినీ సమన్వయం చేస్తున్నాం కాని, హైదరాబాదు చట్టాలు పూర్తిగా తీసివేసి క్రొత్తవి apply చేయాలంటే యింతశ్రమ పడవలసిన అవసరంలేదు. ఆ రకంగా చేయడంలేదు.

శ్రీ పి. నరశింగరావు :—అధ్యక్షా, సమన్వయంచేసేలోపల తెలంగాణా శాసనసభ్యులతోను ఆంధ్ర శాసన సభ్యులతోనూ కమిటీని వేస్తే ఆసమన్వయానికి న్యాయం జరిగేది. ఇకముందు రాబోయేబిల్లులనైనాసరే ఒక కమిటీ ముందుపెట్టి scrutiny అయిన తరువాతనే శాసనసభలోకి తీసుకువస్తే బాగుంటుందని తమద్వారా మనవి చేస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:— కమిటీ పెట్టడం అనేది పెద్ద విషయం. శాసనసభ్యులంతా లైబ్రరీకివెళ్లి చదువుకోవలసినదే. వారు ఒక note యిస్తారు. ఆ note లో explain చేస్తారు. ఆ note తమ దగ్గరకు వస్తుంది. ప్రతి బిల్లులో ఆది రావాలికదా? Existing section, Section embodying amendments యీ రెండూ తమదగ్గరకు వస్తున్నాయి. మీరు చదువుకోవాలి అర్థం వారి నడగాలి. వారు చెబుతారు. దానికి సంబంధించిన implications ప్రచురిస్తే బాగానే వుటుంది. ఆ సహాయం చేయాలని ప్రభుత్వం వారికి సలహా చెబుతున్నాను. అంతే కాని Acts అన్నీ పంచిపెట్టడం కుదరదు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— "Existing section of the original Andhra Act" మాత్రమే యిస్తున్నారు. అంతేకాని తెలంగాణాప్రాంతంలో దాని Corresponding section గాని, issue గాని యేమివుందో తెలియడంలేదు. మేము దానిగురించి అడిగాము.ఆంధ్ర చట్టముల విషయంలో ప్లీడరుగారిదగ్గరకో పోయి తెచ్చుకోడానికి అవకాశంవుంది. Hyderabad Acts విషయంలో చిక్కులు పడుతున్నాము.

మిస్టర్ స్పీకర్: చూస్తాం. అట్లానే నీలున్నంతవరకు సహాయం చేయండి.

## The Andhra Land Revenue Assesments (Standardisation) (Andhra Pradesh Amendment) Bill, 1958.

*Sri K Venkata Rao:*- I beg to introduce the Andhra Land Revenue Assessments (Standardisation) (Andhra Pradesh Amendment) Bill, 1958, and move that the Bill be taken into consideration at once.

అధ్యక్షా ! ఇప్పుడు తమముందు వున్న ఈబిల్లు ఇంతవరకు జరిగిన చర్చకునంబంధము లేనిది. ఇప్పుడు వచ్చిన ఈసవరణ ఇదివరకు ఆంధ్రలో అమలులోవున్న చట్టమునకు చేసిన సవరణ గాని

తెలంగాణాకు సంబంధించినది కాదు. ఈ చర్చకు సంబంధించినది రిః యాక్టు కాదని మనవిచేస్తున్నాను.

ఇప్పుడు వున్న amendment చాలా అవసరమైన నార్మలు ఎమెండుమెంటు. 1956 లో కర్నూలులో Revenue Assessment Standardisation Act ను pass చేయుటం జరిగింది. దానిలో Section 2 (a) లోను 2 (b) లోను ఏమి వున్నదో తమకు చదివి వినిపిస్తాను.

2. Definitions :—In this Act, unless the context otherwise requires —

(i) 'current rates of assessment' means,

(a) in the case of an estate notified under the Madras Estates (Abolition and Conversion into Ryotwari) Act, 1948 (Madras Act XXVI of 1948), the land revenue payable under Section 23 of that Act;

(b) in the case of an inam on which assessment is leviable under Section 3 of the Andhra Inams (Assessment) Act, 1955 (Andhra Act XVII of 1955) the assessment so leviable under the said Section 3;

ఈ రెండు విషయాలు అందులో వున్నాయి. ఇదివరకువున్న సెక్షన్‌లో అప్పటికి అమలులో వున్నరేట్లు అనే పదములు ఉపయోగించారు. తరువాత రైతువారి సెటిలుమెంటు అనేక గ్రామాలలో జరుగుతోంది. అలా జరిగిన గ్రామాలలో రైతువారి సెటిలుమెంటు రేట్లు అమలులో వుంటాయి కానిరైతువారికాకుండా జమిందారిక్రింద టెంపొరరిగా Rent Reduction Act క్రిందవున్నరేట్లు కావు అనే అర్థం తీసుకురావటానికే ఈ amendment తీసుకురాబడింది. అన్నిచోట్ల రైతువారి సెటిల్ మెంటు జరుగలేదు. జరగనిచోట్ల పాతపద్ధతినే నడుస్తున్నది. ఎక్కడ సెటిల్‌మెంటు పూర్తి అవుతుందో అక్కడ సెటిలుమెంటు రేటు అమలులోనికి వస్తుంది అనేది ఈ amendment అర్థం ఇది అవసరాన్ని బట్టి చేయబడింది.

"ryotwari settlement effected under Section 22 of that Act. and till then the land revenue payable under Section 23 of that Act."

23 వ సెక్షను ట్రాన్సిటరి ప్రావిజన్. 22 వ సెక్షన్ పర్మెనెంట్ ప్రావిజన్ పర్మినెంట్. ప్రావిజన్ apply కావాలి.

"Ryotwari assessment imposed under Section 12 of that Act." అనేది ప్రొసీజరల్ ఎమెండిమెంట్. దీనిని సెలక్టు కమిటీకి పంపాలనే మోషన్ వచ్చింది దీనిని సెలక్టు కమిటీకి పంపే అవసరములేదు. ఇప్పుడు నేను ఇచ్చిన సంజాయిషితో దీనిని ఆలోచించి Pass చేయాలని సభ్యులను కోరుతున్నాను.

*Mr. Speaker :* Motion moved.

శ్రీ బసవ మానయ్య:— అధ్యక్షా! 1956 ఆంధ్ర ఈనాముల రద్దు మరియు రైతువారీ మార్పు చట్టమును ప్రభుత్వము తెచ్చినది. అందులో ఎక్కువ టాక్సులు వేయటం కాని, తక్కువగా వుండటం కానిలేదు. దానికి సమానంగా ఈ Standar disation చేయటానికి తీసుకురాబడింది కనుక, మేము notice యిచ్చిన amend ment ను move చేయడములేదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—అధ్యక్షా! ఇది ఇదివరకు Rent Reduction Act క్రిందవుంది. ఇప్పుడు రైతువారిగా Convert చేయటానికి అవకాశం వచ్చింది. అలా convert చేసినపుడు రైతువారి సెస్‌ను ఏసూలు చేయాలి. అది చేసేవరకు Rent Reduction Act క్రిందనే వుండాలి అని చెప్పాము. కొన్ని చోట్ల Rent Reduction Act గవర్నమెంటు ఇవ్వటానికి వీలులేకుండా వుంది. భూస్వాములు కోర్టులకు పోయి స్టే ఆర్డర్లు తెచ్చుకొంటున్నారు. దానిని గవర్నమెంటు defend చేస్తునేవుంది. అయినా దానిని expedite చేయటానికి ప్రయత్నించ నందువల్ల ఈ Act క్రిందకు రాని వారికి ఇబ్బంది కల్గుతున్నది. ఇప్పుడు Rent Reduction Act వచ్చింది కనుక రైతాంగానికి న్యాయం కలిగేటట్లు చూడాలని కోరుతున్నాను. ఈ ఎసెస్ మెంట్‌ను Standardise చేయాలనే నిర్ణయం వచ్చినపుడు ధరల తేడాలలో చాలా చిక్కులు వస్తున్నవి. వివరాలు సరిగా తెలియనందువల్ల అధికారులుఒకదానికొకటి వేస్తున్నారు. దానికి మార్గం కనిపించటంలేదు. వారిని అడిగితే మాకు సరైన instructions రాలేదు అని చెబుతున్నారు. ఆ ప్రశ్నను నేను రెవెన్యూ మంత్రిగారిని అడుగగా మేము clear instructions ఇచ్చాము. వారు సరిగా అర్థం చేసుకోకపోతే మేము ఏమి చేస్తాం, అని అంటున్నారు. ఎవరికి అర్థం కాలేదో నాకు తెలియటం లేదు. మా జిల్లాలోని కొన్ని గ్రామాలలో ఈమార్పు వచ్చింది. ఏవిధంగా Calculate చేస్తారని అడిగితే "మాకు తోచినట్లు చేస్తాము" అని వారు చెబుతారు. Specific orders వారి దగ్గరలేవు. గవర్నమెంటువారివద్ద వున్నాయో లేదో తెలియదు. దీనివల్ల Tax వేసేవారికి ఖచ్చితంగా రావలసినడబ్బు రావటంలేదు. ఉదహరణనకు కమర్షియలు క్రాప్స్‌మీద ఎకరానికి, 'ఇంత' అని Tax వేశాము. ఎకరానికి ఎంత వేయాలో మనం Clear గానే చర్చించి, అంగీకరించాము. ఎకరములో రెండు పంటలువేస్తే ఏదిఎక్కువవుంటుందో దానిపైన ప్రొపోర్షనేట్‌గాను, లేక ఏదిఎంత వేస్తే, దానిమీద అంతే వేయాలని మనం నిర్ణయించాము. Act లో పొరబాటులేదు. కాని అమలు జరపడంలో పొరబాటు వస్తున్నది. అటువంటి పొరబాట్లు జరుగకుండా దీనిని ఆలోచించాలని ప్రభుత్వ మునకు విజ్ఞప్తి చేస్తున్నాను.

శ్రీ కె. కోటిరెడ్డి (లక్కిరెడ్డిపల్లి):— అధ్యక్షా! ఈ బిల్లును Oppose చేసే ఉద్దేశ్యము నాకు లేదు, కాని మంత్రిగారి దృష్టికి కొన్ని విషయములు తీసుకు రావాలనే ఉద్దేశ్యముతో నేను మాట్లాడు తున్నాను.

Rent Reduction Act ఈ దినము చర్చకు వచ్చింది. ఈనాం గ్రామాలను రైతు వారీ గ్రామాలుగా మార్చినపుడు కొంతమంది టెనెంట్సుకు చాలా నష్టము కల్గుతోంది ఆనష్టము కొద్దిమందికే కలుగవచ్చు. అయినా ఆ విషయమునే మంత్రిగారి దృష్టికి తీసుకు రావాలని నేను అను కొంటున్నాను.

ఎలా చేస్తే టెనెంట్స్‌కు మేలుకలుగుతుందో ప్రతివారు ఆలోచించాలి. కొన్ని ఈనాం గ్రామాలలో Rent Reduction ను Act apply చేసినపుడు ముందు ప్రొప్రైటర్‌కు ఇచ్చే rents గవర్నమెంటు Villages లో కంటే తక్కువగా వున్నాయి. రెవెన్యూ గ్రామంగా మార్చినప్పటికి అలాగే వుంటున్నది. ఈనాం గ్రామమును, రైతువారి గ్రామంగా మార్చినప్పటికి రైతులకు మేలు కలగటానికి బదులు కష్టమే కలుగుతున్నది. నేను ఏదో అతిశయోక్తిగా ఇది చెప్పటంలేదు. నేను ఒక టెనెంటునని మంత్రిగారికి తెలుసు. నేను పూర్వం ఎకరానికి 0-2-0 ఇస్తువుండేవాడిని. తరువాత 0-6-0 చేశారు. కాని మా చుట్టుప్రక్కల గ్రామాలలో 0-8-0, 0-12-0, 1-0-0 కూడా వుంది. పూర్వం ఇచ్చే rent కంటే ఇప్పుడు Government Villages అయినందువల్ల Rent ఎక్కువ అయినది. ఈ విషయమును మంత్రిగారు దృష్టి యందుంచుకొని ఆలోచించమని కోరుతున్నాను.

శ్రీ యస్. వేమయ్య (బుచ్చిరెడ్డిపాలెం-రిజర్వుడు).—అధ్యక్షా ! ఇప్పుడు మంత్రిగారు ప్రవేశ పెట్టిన బిల్లు, వారు చెప్పినట్లుగా లాంచన ప్రాయంగానే ప్రవేశపెట్టడం జరిగినా, ఒకసవరణ చదివారు. ఇంకొక సవరణ చదువలేదు. ఇంకొకటి అక్లాజు క్రిందనే ఉంది.

మిస్టర్ స్పీకర్:—(1) జమీందారీ, (2) ఈనాము భూములకు సంబంధించినవి వాటిని చదివారు.

శ్రీ కె. వెంకటరావు:—వారు విని వుండలేదు. కావలసి ఉంటే Proceedings చూచుకో మనండి. Section 12 of the Act అని చదివాను. వారు వినిపించుకోకపోతే నాదికాదు తప్పు.

శ్రీ. యస్. వేమయ్య : 1956 లో ప్యాసు చేసినటువంటి ఈనాం ఆక్టు ప్రకారం, రైతువారీ పట్టా యిచ్చినటువంటివాళ్లదగ్గర కూడ యిదేవిధముగా పన్ను వసూలు చేయాలనిచదివారు. ఈ విషయాన్ని ప్రభుత్వదృష్టికి తేవలసిన అవసరం ఉంది. 1956 చట్టంలో చేసినట్లు, భూమి మీదహక్కులు కల్గినటువంటి వాళ్లకు యివ్వడమేకాకుండా, మధ్యదళారీలకు పట్టాలు యివ్వడం కూడ జరిగింది. ఈవిషయంలో మార్పులు తీసుకొనివచ్చి, ఎమెండుమెంట్సు చేస్తామని ప్రభుత్వం వాగ్దానాలు చేసినది. 1956 లో చట్టానికి 1957 లో సవరణలు తెస్తామని చెప్పినది. ఇంతవరకు తేలేదు. ఈవిధముగా వాళ్లదగ్గరనుంచి ఎస్‌స్‌మెంట్సు వసూలు చేయడానికి కూడ చిక్కు ఉందని ప్రభుత్వ దృష్టికి తీసికొని వస్తున్నాము. ఇదివరకే, చాలామంది, కలెక్టర్ల దగ్గర అప్పీలు చేస్తున్నారు. ఇప్పుడు రైతులకు నోటీసులు యిస్తున్నారు. ఇదివరకు ఎకరానికి నాల్గు రూపాయలు, అయిదు రూపాయలు, ఈ విధముగా ఒక్కొక్క గ్రామములో రెవిన్యూ చెల్లిస్తున్నారు. మొత్తంగా ఈనాం దారు ప్రభుత్వానికి జోడి రూపంలో చెల్లిస్తున్నాడు. ప్రతి ఎకరానికి కూడ, యిప్పుడు గవర్నమెంటు గ్రామానికి చెందిన భూములలో, ఈవిధంగా ఉన్నది. అందువల్ల గవర్నమెంటు దీని ప్రకారం ఎక రానికి ఎనిమిది రూపాయలు, తొమ్మిది రూపాయలు, పది రూపాయలు తీసుకోదలిస్తే, ప్రతి రైతు వద్ద యీనాందారు వసూలు చేయాలా? లేక ప్రభుత్వమే వసూలు చేయాలా? అనేది నిర్ణ యించాలి. ఇదివరలో ఈనాందారు ఎకరానికి నాల్గణాలు, ఎనిమిది అణాలు, రూపాయి చొప్పున హెచ్చించినప్పుడు, అనేక సివిలుకోర్టు హెచ్చించడానికి వీలులేదని చెప్పిన సందర్భాలు ఉన్నవి. కాని ప్రభుత్వం ఇప్పుడు మామూలు రేట్లువేస్తూ., Standardised rates కూడ వేస్తున్నది. ఈవట్టాల సంగతిని తేల్చకుండా ఉంది ప్రభుత్వం. దీనివల్ల ఎన్నో చిక్కులు ఉన్నాయి.

మిస్టర్ స్పీకర్: ఈ Act ప్రకారం ఈనాందారు అంటూ, రైతు అంటూ లేడుకదా? రైతుకు కొంతభూమి వచ్చింది. ఈనాందారుకు కొంతభూమి వచ్చింది. అందరూ రైతులే అయిపోయినారు. ఎవరి క్రింద భూమి ఉంటే వారికి రైతువారీరేటు యివ్వడమేకదా ఈ Act యొక్క ఉద్దేశ్యము.

శ్రీ యన్. వేమయ్య : అని ప్రభుత్వం అర్థం చెప్పతున్నది.

మిస్టర్ స్పీకర్ :—చెప్పేదేమిటి? అందులో ఉన్న విషయము అదే.

శ్రీ యన్. వేమయ్య :— ప్రభుత్వం చేసిన చట్టంలో ఉన్నది. అదే ఇప్పుడు ఈ చట్టం ద్వారా రైతులకు అన్యాయం జరుగుతొంటే, ప్రభుత్వం దానిని సవరిస్తామనిచెప్పి, సవరించకుండా ఉన్నప్పటికికూడ, యితర చట్టాలను ఉపయోగించుకొని రైతులు తమ హక్కులను కాపాడు కొంటున్నారు అందువల్ల వారు రైతులుగానే యున్నారు. కొందరు ఈనాందారులుగానే ఉన్నారు. ఎకరానికి నాల్గు రూపాయలు శిస్తు చెల్లించుకొనేవాళ్లని కొనుక్కోకుండా, అమ్ముకోకుండా ఉన్నవారిని ఈనాందారులని రికగ్నైజుచేసి పట్టా యిచ్చినటువంటివి ఉన్నాయి. ఈరోజున ప్రభుత్వం ఈనాందారు వెయ్యి ఎకరాలు సాగు చేసు న్నప్పటికి కూడ పట్టా యిస్తోంది. ఇవన్ని యింకొక 10 సంవత్సరాలు అయినా ఇరువది సంవత్సరాలు అయినా మారేటట్లు కనుపించడంలేదు.

మిస్టర్ స్పీకర్ :— భుక్తానికి తగాదారావచ్చునుకాని పన్నువే యడానికి తగాదా ఏముంది? భూమి ఎవరిదగ్గరఉంటే, వాళ్లదగ్గర పుచ్చుకొంటారు.

శ్రీ యన్. వేమయ్య :—పన్ను ఎవరిమీాద వేయాలి?

మిస్టర్ స్పీకర్ :— భూమి ఎవరి స్వాధినంలోఉంటే వారిమీాద. హక్కుదారుడు ఎవరో వారిమీాద వేస్తారు.

శ్రీ యన్. వేమయ్య :—అందువల్ల హక్కుదార్లకు నోటీసులు యిస్తున్నారు ఈనాందార్లు.

మిస్టర్ స్పీకర్:— హక్కుదారుడు, ఎవరు అన్నది కోర్టుకు పోతేగాని తెలియదు.

శ్రీ యస్. వేమయ్య:—అందువల్లనే త్వరగా ప్రభుత్వం తీసుకు రావలసిన చట్టం తెచ్చి, కావలసి నటువంటి చర్యలు తీసుకోవడంలేదని, ప్రభుత్వ దృష్టికి ఈ సందర్భంలో మీ ద్వారా తీసుకొని వస్తున్నాము. ఆంధ్ర రాష్ట్రంలో ఇది వరకే మనం, ఇంటర్‌మీడియేట్స్ అన్నవారిని రద్దు చేశామని చెబుతున్నావే కాని, యింకా, అది పూర్తి కాలేదు. తెలంగాణాకు సంబంధించినంతవరకు యిబ్బందిలేదు. మనము, ముందు జమీందారీలను రద్దు చేశామని చెప్పుకోడానికేగాని, యు. పి. మొదలైన అనేక రాష్ట్రాలలో మనకంటె వెనుక ప్రారంభించి, ఈ ఇంటర్‌మీడియేట్స్‌ను లేకుండా చేశారు. ఈ బిల్లులో ముఖ్యమైనది Standardisation అన్నది. సరియైన Principle మీద జరుగలేదు. ఇది ప్రభుత్వానికి కూడా తెలుసు, అంగీకరించిందికూడ. ఇదివరకు బ్రిటిష్ ప్రభుత్వం వేసినటువంటి పద్ధతుల మీదనే జరిగింది. తరువాత అవి పెంచడానికి Re-settlement జరిగినప్పుడు దానిని కాంగ్రేస్ పార్టీ వ్యతిరేకించింది. ఇప్పుడు ప్రభుత్వాన్ని నిర్వహిస్తున్నది ఆ కాంగ్రేస్ పార్టీయే ! ఆ principles అన్నీ కూడ బ్రిటిష్ ప్రభుత్వం

చేసినవి. "రేగడికి యింత, ఎర్ర నేలకు యింత" అనివాళ్ళు నిర్ణయించారు. భూములను చూచిగాని, పంటను బట్టిగాని ఈ రేట్లు నిర్ణయించలేదు. మనం Standardisation చెయ్యాలని ఈ బిల్లు తీసుకొని వచ్చారు.

మిస్టర్ స్పీకర్ — Rent Reduction Act ను అంతా మారిస్తే తప్పయిపప్పుడు ఏమి వేస్తారు? రైతువారీరేట్లు ఈనాములకు వేస్తున్నారు కాబట్టి ఆ question యిందులో arise కాదే?

శ్రీ యస్. వేమయ్య — అందు వల్లనే అదికూడా standardise చేయమని ప్రభుత్వ దృష్టికి తెచ్చాము. ఇన్ని చిక్కులు లేకుండా మేము తెల్సుసుకున్నంత వరకు కేరళలో వేసిన flat rates ప్రకింద ఎకరానికి రెండు రూపాయలు వేసి మిగిలిన దానికి గ్రేడేషన్ రేటు వేసి, ఆదాయం వచ్చేవాళ్ల మీద పన్నులు వేయాలి. ఎకరానికి రెండు రూపాయలు మాత్రమే శిస్తు. ధనవంతులు, మిగుల్చుకొనేవాళ్ళు, భూస్వాములు ఎక్కువ చెల్లిస్తారు.

మిస్టర్ స్పీకర్:—అది అంతా వేరే రావాలి.

శ్రీ యస్. వేమయ్య:—ఇతర రాష్ట్రాలవారు చాలా simple గా తయారు చేశారు. మన వెంకట్రావుగారు రెవిన్యూలో అఖండమైన ప్రజ్ఞావంతులని పేరుగాంచారు. అటువంటి simple Acts ను తీసుకునివస్తే బాగుంటుంది. కాలంకూడా మారిపోయింది. కాలానికిఅనుగుణంగా యివన్నీఉండాలి. అసలు సిస్తు విధానాన్నే మార్పుచేయాలి. ఇది అంతాఅపసవ్యమైన పద్ధతిలోఉంది. "1954—55వరకు నాకు పన్నులు ఎక్కువ కాలేదు. తరువాత నుంచిపన్నులు ఎక్కువ చేస్తున్నారు. ఈ విధముగా పెంచడానికి మేము కాంగ్రేస్‌ను హెచ్చు స్థానాలలో గెలిపించడమే నాకారణము" అని చాలా చోట్ల రైతులు అనుకొంటున్నారు. ప్రభుత్వం ఈ విషయాలన్నిటిని గమనించి, ముఖ్యంగా ప్రజలు కోరుతున్నటువంటి విధానాలను రెవిన్యూ శాసనములలో వెంకట్రావుగారు తీసుకొని వచ్చెదరని ఆశిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

శ్రీ జి. ఎల్లమందారెడ్డి (కనిగిరి):-అధ్యక్షా! ఎస్టేట్సు ప్రాంతంలో, taken-over estates లో సెటిల్‌మెంటు జరుగుతున్న కొన్ని ప్రాంతాలలో, ఆ సెటిల్‌మెంటు రేట్సు ప్రకటించారు. ఇప్పుడు ఉన్నటువంటి జమీందారీ ప్రాంతాలలో, మెట్ట ప్రాంతాలలో రేట్లు చాలా జాస్తీగా ఉన్నాయి. కాని ఈ రేట్ల నిర్ణయం settlement శాస్త్రయుక్తముగా ఎక్కడా జరుగలేదు. Settlement offcer, కొన్ని చోట్ల నిర్ణయించిన రేట్లు అధికంగా ఉన్నాయని మీ ద్వారా మంత్రిగారికి మనవి చేస్తున్నాను. ఉదహరణకు నెల్లూరు జిల్లాలో, పొదిలి తాలూకాలో ఎందుకు పనికిరాని మెట్టకు ఎకరానికి మూడురూపాయలనుంచి, ఎనిమిది రూపాయల వరకు సెటిల్‌మెంటు వారు రేట్లు నిర్ణయించారు. ఈ నిర్ణయాలు, ఈ రేట్లు, rough patts యిచ్చిన సందర్భాలలో బయటపడ్డాయి. Rent Reduetion Act ప్రకారం చూచినాకూడా రేట్లు చాలా జాస్తీగా ఉన్నాయి. ఈవిధంగా, కేవలం ఇదివరకే frame చేయబడిఉన్నరూల్సు ప్రకారం settlement చేయడంకన్న, భూముల దగ్గరకు వెళ్లి ఎంత పంట పండుతున్నది? ఆ పంటను బట్టి ఏ రేటు చొప్పున పన్నులు విధించాలి? అన్న విషయాలు ఆలోచించవలసిన అవసరం ఉంది. ఆ రకంగా జరిగినప్పుడే settlement యొక్క ఉద్దేశ్యమునెరవేరుతుందని మనవి చేస్తున్నాను. అంతే కాకుండడా ఈ settlement-rates నిర్ణయించిన తరువాత రైతులు అక్షేపణలు చెప్పుకున్నప్పుడు ప్రభుత్వంకాని, ఉద్యోగులుకాని, సక్రమమైన విధానాన్ని అనుసరించవలసినదిగా చేయమని నేను

మనవి చేస్తున్నాను. Rough pattas ను యిచ్చే సందర్భంలో ఒక offieer ఒక గ్రామానికివెళ్లడం, హడావిడిగా ఆ పట్టాలన్ని ఆ ఊరిలో షుమారు ఏ వెయ్యో, పన్నెండు వందల మందికో యివ్వడం జరుగుతోంది. ఒకరికి యిచ్చిన పట్టా అతనిది అవునో కాదో చూడవలసి వుంది. పన్ను రేటు సక్రమంగా వుందా? లేదా? అనేది యింకో విషయం ఇవన్నీ విచారణ జరుపడానికి కావలసిన వ్యవధి ఏమాత్రంకూడా యివ్వడం లేదు. Settlements జరిగే టప్పుడు, రైతులకు వుండే ఆక్షేపణలు తెలుపుకోవడానికి వారికి హక్కువుంది. కనీసం యీ హక్కునైనా వారు వినియోగించుకొనే అవకాశం లేక పోతే, వారికి కలిగే నష్టం అపూర్వమైంది అవుతుంది. అనేక సందర్భాలలో పట్టాలు ఒకరివైతే భూమి యింకొకరికి రావడం జరుగ తోంది. రేటు ఒక రకంగా వుంటే, ఇంకోరకమైన రేటు రావడం జరుగుతోంది. Rough Pattas విచారణ సందర్భంలో కూడా సక్రమంగా విచారణ జరిపేటట్లు చేయాలి. అదే విధంగా పన్నుల వ్యవహారం లో కూడాను ప్రభుత్వానికి తమ ఆక్షేపణలు తెలియ చేయడానికి పూర్తి అవకాశం కలుగ చేయ్యాలి రెవిన్యూ మంత్రిగారు అక్కడకు వచ్చిన సందర్భంలో rough pattas యిచ్చే సందర్భంలో వుండే కష్టా లన్నీ కూడా, మంత్రిగారికి చాలా మంది రైతులు, అక్కడి శాసన సభ్యుడుకూడా నివేదించుకున్నారు. Settlement జరిగేప్పుడు సక్రమంగా జరిగేటట్లుగాను, సాధ్యమైనంతవరకు న్యాయమైన రేట్లు విధించబడేటట్లు గాను, , విధించబడిన తరువాత rough pattas ఇచ్చే విచారణ సందర్భంలో ప్రజలకు చెప్పకొనే అవకాశం ఉండేటట్లుగాను, లోపాలను rectify చెయ్యడానికి కావలసిన చర్యలు ప్రభుత్వం సక్రమంగా తీసుకొనేటట్లుగాను మంత్రిగారు చేస్తారని ఆశిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:— తక్కిన వన్నీ Act కు సంబంధించినవి కావు. ఎవరు, ఎక్కడ అక్రమం చేస్తు న్నారు? Survey Officer or Settliment Officer చేస్తున్నాడనేది యిక్కడ లేదు. ఉన్నదల్లా 23 Section ను Settlements లోనివాటికి వర్తింప చేయడం. 22 Section చేటి క్రింద ఎంత పన్ను వెయ్యాలనేది. ఈ Rent Reduction Act అమలులో వుండే లోపాలను యిక్కడ చెప్పి ఏమి ప్రయోజనం? అది లేకుండా దీనిని గురించి ఏమైనా చెబితే చెప్పండి.

శ్రీ యస్. వెంకయ్య (అద్దంకి) :—అధ్యక్షా ! ఈ Rent Reduction Act యిది వరకు ఈనాములుగా పరిగణింపబడుతున్న గ్రామాలకు కొన్నింటికి వర్తింప చేశారు. ఆ గ్రామాలు కోర్టు తీర్పులోనివా? కాదా ? అని తికతిమక పడుతూ, యింతవరకు తెలియకుండా నష్ట పడుతున్నారు. ఇప్పడు Rent Reduction Act వల్ల తగ్గింప బడుతున్న శిస్తు ఈ వాందార్లో లేకపోతే జమీందార్లో తీసుకోవడం జరుగుతోంది. ఈ మార్పువల్లఆ Rent Reduction Act కాస్తావర్తించకుండా పోవడం జరుగుతుందేమోనన్న అనుమానాన్ని నివారింప వలసిందిగా నేను Revenue Ministr గారిని కోరుతు న్నాను. ఈ మార్పువల్ల వుంటున్నప్రమాదాలేవో ఒక్కసారి Revenue Minister గారు విని, ఈ మార్పువల్ల వుండే బాధలేమీ లేకుండా నివారణ చేయడానికి ప్రయత్నించడం మంచిదని చెబుతున్నాను. ఈ సందర్భంలో కొన్ని వివరాలను తెలియ చేస్తాను.

శ్రీ కె. వెంకటరావు— ఊరుకొన్న కొద్దీ అసలు బిల్లుకు సంబంధంలేని విషయాలు మాట్లాడుతున్నారు. Rent Reduction Act కు దీనికి అసలు సంబంధమే లేదు, వాటిని పాటించ డానికి వీల్లేదు. సభ్యులను మీరు మాట్లాడనిస్తే మాట్లాడనివ్వండి, నా కేమి అభ్యంతరం లేదు. దీనికి

సంబంధించిందిఎవరు చెప్పినా ఆలోచించడానికికి నాకు వీలు కలుగుతుంది. ఒకరు చెప్పవలసిన ఉపన్యాసం శాసన సభలో చెబుతున్నారు. ఆ బిల్లు వచ్చినప్పుడు చెప్పాలికాని యీ వేళ చెప్పవలసిన పనిలేదు.

మిస్టర్ స్పీకర్:—ఎవరు మాట్లాడినా బిల్లుకు సంబంధించి మాట్లాడితేనే మాట్లాడండి కేవలం యీ బిల్లులోని మాటలకు సంబంధించే ఏమైనా చెబితే చెప్పండి. లేకపోతే చర్చ దీనితో సమాప్తం చేస్తాను. ఏదో చెబుతాము పోనివ్వండి అంటే, ఎంత దూరమైన పోతున్నది. అందువల్ల లాభం లేదు.

శ్రీ యస్ వెంకయ్య :— పూర్తి వివరాలు యిచ్చిన తరువాత section లపై చర్చలో నేను మాట్లాడతాను.

శ్రీ కె వెంకటరావు:—Section కు ఎక్కడా సవరణలు లేవు, పాపం మామిత్రుడు ముందుగా జాగ్రత్త పడలేదు. ఇవి అందరు అంగీకరించినట్లే దీనిలో విషయాలేమీ ఎక్కువగాలేవు. అయితే కొందరు మిత్రులు మొట్ట మొదట దీనికి సంబంధించిన విషయాలు కొన్ని చెప్పారు అందు చేత సమాధానాలు చెప్పవలసిన అవసరం ఏర్పడింది

ఇందులో మొట్ట మొదటిది "application of the act" ను గురించి శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారు చెప్పారు. దానికి సంబంధించినటువంటివి ఎక్కడైనా లోపాలు వున్నా Act అంతా clear గా వుందని వారే ఒప్పుకొన్నారు. ఎక్కడైనా అమలులో సరిగా లేకపోతే దానిని ప్రభుత్వం వారి దృష్టికి తీసుకు వస్తే దానిగురించి ఆలోచించడానికి వీలుంటుంది. ఇప్పుడు settlement rates గురించి ఇంకా ఎట్టి నిర్ణయం జరుగలేదు. కొన్నిచోట్ల rates ఎక్కువవు తున్నాయని వారు చెప్పారు. ఈ విషయం బిల్లు ప్యాసు చేసినప్పుడే అందరికీ తెలుసును. స్వరాజ్యం వచ్చిన తరువాత నాకు పన్ను ఎక్కువైందని అనుకొనేవాడు ఎంత నవ్యంగా ఆలోచిస్తున్నాడో మనం గ్రహించుకోవాలి. settlement అయిన తరువాత rate ఎక్కువై వుంటే, ఆ విషయాన్ని ఆలోచించవలసిన ఆవశ్యకత ఏర్పడుతుంది. కాబట్టి ఈనాం రైతుకు తక్కువ రేటుపడి, ప్రక్కనున్న రైత్వారీ రైతుకు ఎక్కువ పడడానికి Constitution ఒప్పుకోదు. ధర్మమూ కాదు, న్యాయంలేదు. ఎక్కువ పన్నులు ఎక్కడ వేస్తే అక్కడ, ఈనాం రైతు కానివ్వండి, జమీందారీ రైతు కానివ్వండి , రైతు వారీ రైతు కానివ్వండి అంతా కూడా సమాజ వికాసానికి, దేశ భవిష్యత్తుకోసం, వాటిని వ్యతిరేకించడంకాని, మమ్ములనుఒప్పించి, తగ్గించే ప్రయత్నం చేయడానికి కాని వీలులేదని నేను మనవి చేస్తున్నాను. Revenue Minister గారికి యీ అన్ని విషయాలు తెలిసి వుండవచ్చు. తె లి సి వు ం టే వున్నటువంటి ఉద్దేశ్యాలను మార్పు చేయాలనే భావం ఏమీ లేదు. ఇంతకు ఎల్లమందారెడ్డిగారు ఎత్తిన point ఒకటి వుంది. Rough pattas యిచ్చే సందర్భంలో ఎక్కడైనా, ఏదైనా అన్యాయాలు జరుగుతుంటే నాకు చెప్పారు. చెప్పిన నాలుగు గంటలలో పలే దానికి పరిహారం యిచ్చే యత్నాన్ని నేను చేశాను. ఈ విషయాన్ని వారుకూడా అంగికరించారు. ఇంకా ఏమైనా వుంటే నా దృష్టికి తీసుకు వస్తే, ఏవైనా ఆక్షేపణలు వుంటే తప్పకుండా నేను వాటిని గురించి తగిన కృషి చేయడానికి గాను, ఎట్టి అభ్యంతరము లేదు. శంకరయ్యగారు "Section 3 (ii) (d) of the Act" గురించి మా ట్లా డా రు. వారు పైకి చెప్పలేదు. కాని, మన్ననుృలో వున్నది. గర్భ కంద్రికలు Inam Abolishion Act క్రిందే వీటిని గురించి చర్యలు తీసుకోవచ్చని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది.

అందువల్ల వారు అనుకొనేటటువంటి ఆపోహ యీ విషయంలో లేదని మనవి చేస్తున్నాను. ఇంక రెండవ సెక్షన్ గురించి చెప్పవలసివున్నది. అందులోని విషయం చాలా చిన్నది. Estate Abolishion Actలోని 2 వ సెక్షన్‌లోనే వున్నది. ఎప్పుడైతే parmanent settlement అయిందో అప్పటినుంచి ఆ ప్రకారం వసూలు చేస్తారు. 1956 వ సంవత్సరంలో బిల్లు పెట్టడంలో యివి తాత్కాలికంగా వసూలుచేస్తామని చెప్పడమైనది. Settlement అయిన తరువాత standrtd rates ప్రవేశ పెట్టుతున్నామని దీనిఅర్థం. ఈ బిల్లులో యింకే యితర భావాలేమిలేవు. సభవారు యీ బిల్లును ఆమోదించవలసిందని నేను కోరుచున్నాను.

*Mr. Speaker* The question is ·

"That the Andhra Land Revenue Assessment (Standardization) (Andhra Pradesh Amendment) Bill, 1958, be taken into consideration at once."

The motion was adopted.

*CLAUSE, 2.*

*Mr. Speaker :* The question is :

"Clause 2 stand part of the Bill."

The motion was adopted.

Clause 2 was added to the Bill.

*CLUASE, 1.*

*Mr. Speaker :* The question is :

"Clause 1 stand part of the Bill."

The motion was adopted.

Clause 1 was added to the Bill

*PREAMBLE.*

*Mr. Speaker :* The question is :

"The Preamble stand part of the Bill."

The motion was adopted.

The Preamble was added to the Bill.

*Sri K. Venkata Rao :* I beg to move :

"That the Andhra Land Revenue Assessments (Standardization) (Andhra Pradesh Amendment) Bill, 1958 be passed into law."

*Mr. Speaker :* Motion moved.

(Pause)

*Mr. Speaker :* The question is :

"That the Andhra Land Revenue Assessments (Stndardization) (Andhra Pradesh Amendment) Bill, 1958 be passed into law."

The motion was adopted.

## The Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :- On a Point of order, Sir, అధ్యక్షా ! మొన్న, Regional council ను ఏర్పాటుచేస్తున్నటువంటి order చదివారు దాని ప్రకారం Motor Spirit taxation Bill ఆ Regional council ముందుకు పోవలసినటువంటి అవసరం ఉంది. దీనిలోని 13 వ clause లో

"The Hyderabad Sales of Motor Spirit Taxation Regulation 1358 F. (No. 24 of 1358 F ), in so far as it applies to, and is in force in the transferred territories, is hereby repealed :

Provided that such repeal shall not affect.........."

అని ఉంది. తెలంగాణాకు సంబంధించినటువంటి చట్టాన్ని ఇప్పుడుమనం repeal చెయ్యడం జరుగుతోంది. అందువల్ల Regional Council దీనిని చర్చించిన మీదటనే, మనం చర్చించవలసి ఉంటుంది. హైదరాబాదు Regulations లో ఏముందో చదువకుండా సరాసరి నాటిని బుట్ట దాఖలా చేసి, వాళ్లు ఎంతో కష్టపడి pass చేసినటువంటి Regulations ఖాతరు చేయకుండా ఈ విధంగా చట్టాలు చేయడం సరైనటువంటి సాంప్రదాయంకాదు. గనుక దీనిని Regional Council కు పంపించవలసిన అవసరం ఉందని మీ దృష్టికి తీసుకొస్తున్నాను. అదీ కాకుండా ఇప్పుడు ఈ హైదరాబాదు Regulations ను repeal చేస్తున్నా మంటున్నారు. ఏ Regulations repeal చేస్తున్నారో, ఎలా చేస్తున్నారో, ఇవన్నీ ఇప్పుడు Minister గారు చెప్పగలరా ? లేక మంత్రి అయినటువంటి నేను ఆ విధంగా చేస్తే ఎవరు కాదంటారని, అనుకుంటున్నారా ! గోపాల రెడ్డిగారు. ?

ఈలాగే వారు distribute చేసినటువంటి Courtfees Act గురించి చివరికి, పెద్ద గందరగోళంఅయినది. గనుక అటువంటి ఇబ్బందులు ఏవీరాకుండా తప్పనిసరిగా ఈ regulations Reginal council కు వెళ్ళాలి. కాబట్టి దీనిని వాయిదా వెయ్యాలని కోరుతున్నాను.

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—అధ్యక్షా ! ఈ Bill యొక్క స్వరూపం తెలుసుకోకుండా, వారు Regional council కు పోవాలంటున్నారు. దీనిలో మొదటి పర్యాయంగా taxation కొంచెం తగ్గుతుంది. హెచ్చింపు లేనేలేదు. అందువల్ల దీని ప్రతిపాదనకు ఆక్షేపణలు తెలపగూడదని మనవి చేస్తున్నాను. తెలంగాణా చట్టాలు ఏ మైపోతవోనని భయపడవలసిన అవసరంలేదు. అది Major

General chowdary గారు ఉన్నప్పుడు జరిగినటువంటి regulation దానివిషయమై కొంతమంది సందేహించి, High court లో writ petition కూడా పెట్టుకున్నారు. ఇప్పుడు దానిని repeal చేసి ఆంధ్ర Act ను తీసుకువస్తే ఆ పర్యవసానంగా వచ్చేటటువంటి నష్టము ఏమీ లేదు. లేశమైనా లేదు. దీని వల్ల లాబమే గాని నష్టంలేదు అందువల్ల లాభాలను పోగొట్టుకోకుండా వెంటనే దీనిని move చేయడానికి అవకాశం ఇవ్వవలసిందని కోరుతున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—అధ్యక్షా ! తక్కువ చేస్తున్నారని తెలుసుకోవడానికి, ఆ హైదరాబాదు Provisions మీ ముందు ఉంచాలికదా? కావున ఈచిన్న విషయాన్ని అర్థంచేసుకోలేని పరిస్థితులలో మంత్రి వర్గం కాని, కాంగ్రేసు పార్టీగాని ఉందని నేను అనుకోవడంలేదు.

శ్రీ కె వెంకటరావు :—అధ్యక్షా ! కాంగ్రేసు పార్టీ విషయం దీనిలోకి ఎందుకు వచ్చింది? మంత్రివర్గం అర్థం చేసుకోలేక పోవచ్చు లేక మంత్రిగారు తెలుసుకో లేక పోవచ్చుగాని, మధ్యన కాంగ్రేసు పార్టీ మీద అంత చులకన ఎందుకు ? అలవాటు లేని విషయం ఈ సందర్భంలో మాట్లాడ్డం బాగాలేదు

మిస్టర్ స్పీకర్:—ఈ Madras Sales of Motor Spirit Taxation Bill, Regional Council కు పోవాలా, లేదా అనేటటువంటిది మొదటి ప్రశ్న. Regional Committee appointment order ఇక్కడ వున్నది.

"The Andhra Pradesh Regional Committee Order 1958. In exercise of the powers conferred by clause (1) of Article 371 of the Constitution, the President hereby makes with respect to the State of Andhra Pradesh, the following Order namely:"

అది అమలులోకి వచ్చింది. ఇందులో ఉన్నటువంటి Provisions ఏమిటనే ప్రశ్న

"(4) All scheduled matters in so far as they relate to the Telangana region shall be within the purview of the Regional Committee to the extent and in the manner provided by this Order."

(5) Every bill affecting the Telangana region which is not a Money Bill and contains mainly provisions dealing with any of the scheduled matters, shall, upon introduction in the Assembly be referred to the Regional Committee for consideration and report to the Assembly.

Money Bill కాగూడదు. రెండవది, Scheduled Matters ఏవైతే ఉన్నవో వాటికి సంబంధించింది మాత్రమే అయి ఉండాలి. అటువంటప్పుడు ఆ Bill ను అసెంబ్లీలోకి తీసుకు రావచ్చు.

"shall, upon introduction in the Assembly be referred to the Regional Committee for consideration and report to the Assembly." అని కూడా ఉన్నది.

అట్టి సందర్భంలోనే బిల్లును Regional Committee కి పంపించాలి. వారు విచారించిన తరువాత వారొక రిపోర్టు ఇస్తారు. ఆ రిపోర్టు వచ్చిన తరువాత మళ్లీ ఇక్కడ విచారణ జరుగుతుంది. ఇది Money Bill.

1st February నుంచి తెలంగాణాకు Regional Council ఏర్పడింది గనుక, ఇప్పుడు ఈ Point of order ప్రకారం దీనిని పంపించాలా ? పంపించకుండా మీ అంతట మీరే చేసుకొని పోవచ్చునా ? ఈ విషయంలో నా Ruling ఏమంటే; మీ అంతట మీరే చేసుకు పోవచ్చు గనుక పిల్లలమర్రి వెంకటేశ్వర్లుగారు లేవదీసిన Point of order ను నేను అంగీకరించడం లేదు.

శ్రీ కె యల్. నరసింహారావు:—అధ్యక్షా ! ఇది money bill కనుక గవర్నర్‌గారి అనుమతి తీసుకొన్నారా ?

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—తీసుకొన్నాము. అలా కాకపోతే స్పీకరు గారు చర్చకు అనుమతించి వుండేవారేకాదు.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య:—అధ్యక్షా ! రీజినల్ కౌన్సిలుకు సంబంధించిన రూల్సు ఏవో నివేదించారు అవి మాకు అంద చేయిస్తారా ? అవి ఆంధ్ర గజిటులో రాలేదు

మిస్టర్ స్పీకర్:—ఒకటువ తారీఖు లోపల అంద చేస్తారు.

*Dr. B. Gopala Reddi :* Sir, I beg to introduce the Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958 and move that the Bill be taken into consideration at once.

*Mr. Speaker :* Motion moved.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—దీనిలో ఎలాంటి శిస్తు హెచ్చింపుగూడా లేదు. ఇప్పుడు ఆంధ్రలోగాని తెలంగాణాలోగాని పెట్రోలు మీద గ్యాలన్‌కు రూ. 0—6—0 వేస్తున్నారు. మోటారు స్పిరిట్సు మీద అక్కడ, ఇక్కడ రూ. 0—3—0లే వేస్తున్నారు. కాబట్టి ఈరెంటిలో తేడా ఏమీలేదు. కాని aviation spirit కు ల్యూబ్రికేటింగు ఆయిల్‌కు తెలంగాణాలో రూ. 0—4—0, ఆంధ్రలో రూ. 0—3—0 వేస్తున్నారు. ఈ బిల్లు ప్రకారం ఇది అంతా రూ. 0—3—0 అవుతుంది. ఏవియేషన్ పెట్రోలుకు సంబంధించినంతవరకు రూలుకు మాత్రము ఆంధ్రలో రూ. 0—6—0 యున్నది. తెలంగాణాలో రూ. 0—3—0 వుంది. కాని ఆంధ్రలో ఏడెనిమిది సంవత్సరములనుండి గూడ executive orders క్రింద కేంద్ర ప్రభుత్వమువారు అడుగుటవల్ల మినహాయింపు ఇవ్వడం జరిగింది. కాని చట్టంలో

ఏవియేషన్ స్పిరిట్‌కు రూ. 0—6—0 వేసుకోవచ్చునని ఉంది. కీ. శే. కిద్వాయిగారు న్నప్పుడు కేంద్ర ప్రభుత్వంవారు వ్రాసినందువల్ల ఆంధ్ర ప్రభుత్వంవారు దానికి exemption ఇచ్చారు. ఇక్కడ హైదాబాదులో ఎలాంటి exemption ఇవ్వలేదు. ఇక్కడ రూ. 0—6—0 మాత్రమే వున్నది అందువల్ల ఇప్పుడు రెంటిని సమన్వయ పరచి అంతట రూ. 0—3—0 చేసి, ఆంధ్రలోవున్న exemption తీసివేయాలనుకొను చున్నాము. ఇక కేంద్ర ప్రభుత్వవిమానములు వచ్చి నప్పుడు వారికి ఇంతకు ముందు ఉన్న exemption ఇక లేకుండా పోతుంది. కాని యీ చట్టం ప్రకారం రూ. 0—6—0 అన్నది రూ .0—3—0 అవుతుంది. అప్పుడు బేగం పేటలోను, వైజాగ్‌లోను సమానంగా వుంటుంది. లూబ్రికేటింగ్ ఆయిల్‌కు తెలంగాణాలో ఇప్పుడు రూ 0—4—0 ఉన్నది. ఈ చట్ట ప్రకారం రూ 0-3-0 కాబోతున్నది.. కాబట్టి తగ్గింపుఉన్నదేగాని హెచ్చింపు ఒక్క దమ్మిడీగూడ లేదు. తరువాత ఈ సందర్భంలో రేట్ నయాపైసాల క్రింద మార్చుకుంటున్నాము. గ్యాలన్ పెట్రోలుకు ఆంధ్రలో రూ. 0—6—0 ఉన్నది. ఇచ్చట తెలంగాణాలో 0—37 NPS ఉన్నది. రెండుసమానమే. కాబట్టి దానిని పూర్తిగా నయా పైసల క్రింద చూపడ మైనది. రూ. 0—3—0 అన్నది. 0—19 నయాపైసాలని వేయడం జరిగింది. అందు వల్ల దీనిని పబ్లిక్ఒపీనియన్‌కు గాని, సెలెక్టు కమిటీకి గాని పంపవలసిన అవసరం ఏ మాత్రమూ లేదు. మేజర్ జనరల్ చౌదరీ గారి కాలంలో తెలంగాణాలో ఈ చట్టం జారీ చేశారు. ఆయనకు అధికారం ఉన్నదా ? లేదా ? అని హై కోర్టులో ఒకరిట్ ఉన్నది. అయితే ఆ రిట్ గెలుస్తారా లేదా అన్నది ముఖ్యంకాదు. ఏదో డబ్బు కట్టు కొంటే వాయిదా వేస్తారు. అనే ఉద్దేశంతో వేయడం జరిగింది. ఏ మైనప్పటికి యీ Act ఇప్పుడు రద్దు అవుతుంది. అందువల్ల తెలంగాణాకు నష్టము వచ్చే ప్రశ్న ఉదయించదు. ఇచ్చట తగ్గింపుయున్నది. గాని, హెచ్చింపు అన్నది లేదు కాబట్టి సెలక్టు కమిటీకి గాని, పబ్లిక్ ఒపీనియన్‌కు గాని పంపించకుండా వెంటనే దీనిని discuss చెయ్యాలని కోరుతున్నాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— on a point of information sir, ఇప్పుడు ఇచ్చిన అనెక్షర్ రెండవ పేజీలో "in the case of petrole at the rate of one anna and six pies per gallon" అని ఉంది. దానిని 0—37 నయా పైసల క్రింద మార్చామని అమెండ్‌మెంటులో వ్రాశారు.

శ్రీ కె. వెంకట రావు:—ఇదివరకు orginal notification లో 0—1—6 అని ఉంది. తరువాత జరిగిన notifications అన్నింటిలోను రూ. 0—6—0 గా మార్చబడింది. అది original actలో ఉన్నందు వల్ల అది అలాప్లింటు అయినది. అంతకంటే మరేమీ లేదు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—మొదట 1939 లో రూ. 0—1—6 ఉండేది. తరువాత రూ. 0—4—0 ఐనది మరి కొంత కాలం తరువాత అది రూ. 0—6—0 లకు పెంచ బడింది. మనం కర్నూలులో డీసెల్ స్పిరిట్ మీద రూ. 0—1—6 నుండి రూ. 0—3—0 చేశాము.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—అధ్యక్షా ! నిన్న నేను మంత్రిగారితో మాట్లాడినాను. Act లో రూ. 0—1—6 ఉంది. ఇప్పుడు రూ. 37 నయాపైసలని ఉంది.

శ్రీ కె. వెంకటరావు:—గౌరవ సభ్యులు నేను చెప్పే విషయం అర్థం చేసుకోడానికి ప్రయత్నించాలి. రూ. 0—1—6 అని original Act లో ఉన్న మాట నిజం. కాని దానిలో ఉన్న హక్కు ప్రకారం నోటిఫికేషన్ జారిగాచేసి రూ. 0—1—6ను దరిమిలా రూ. 0—6—0లకు పెంచారు. ఈ వేళ అమలులో రూ. 0—6—0 లే ఉన్నది. అంటే 0—37నయాపైసలున్నది దానిని ఇక్కడ apply చేస్తున్నారు కాని అంతకంటే ఏమీలేదు.

మిస్టరు స్పీకర్:—"in the case of petrolen at the rate of one anna and six pies" అనివుంది. కాబట్టి అది న్యాయమైన ఆక్షేపనే కదా ! అందుకు ఆర్థిక మంత్రిగారు ఏమి చెప్పుతారు ?

డాక్టర్ బి గోపాల రెడ్డి:—అది 1939లో జరిగింది తరువాత రూ. 0—4—0 అయినది. ఆ తరువాత రూ. 0—6—0 అయినది.

మిస్టర్ స్పీకర్:—ఆ విధంగా ఇక్కడ ఎందుకు వేయలేదు ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—పొరపాటువల్ల అలా ప్రింటు అయిందండి.

*Sri Baswa Maniah :* I beg to move—

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be referred to a Select Committee."

*Mr. Speaker :* Motion moved.

శ్రీ బసవ మానయ్య:—అధ్యక్షా, ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపవలయునని నేను కోరుతున్నాను. ఇప్పుడు మంత్రిగారే ప్రింటులో పొరపాటు జరిగిందని ఒప్పుకున్నారు ఆ విధంగా ఈ బిల్లులో ఇంకా ఎన్ని తప్పులున్నాయో ! కాబట్టి ఒకటి రెండు రోజులు ఆలస్యమైనా ఇందులో మునిగి పోయేది ఏమీలేదు. 1958 మద్రాసు మోటారు స్పిరిట్టు అమ్మకం పన్ను విధింపు (ఆంధ్ర ప్రదేశ్ విస్తరణ సవరణ చట్టము) అని ప్రభుత్వం దీనిని తీసుకు వచ్చింది. అందులో గ్యాలన్ కు రూ. 0—6—0-, రూ 0—5—0, రూ. 0—4—0 రూ. 0—3—0 అని ఎన్నో వ్యత్యాసములను మంత్రిగారు చెప్పినారు. ఈ Act గూడ్సు విషయం పాసెంజర్ల విషయంలో అది ఇక్కడ తెలంగాణా కు వర్తింప చేసినప్పుడు, ఇందులో విపులంగా ముందు ఉన్న టాక్సు, ఇప్పుడు తీసుకరాబడే టాక్సు ఏ విధంగా హెచ్చింపబడుచున్నదన్నే విషయం మనం చూడాలి. ఏలాంటి హెచ్చింపు లేదని మంత్రిగారు సెలవిచ్చారు. కాని ఇందులో ఏవియేషన్ స్పిరిట్ గాక తక్కువ పెట్రోల్ విషయంలో గ్యాలన్ కు 0—37 నయాపైసల చొప్పున విధించబడును. 1939 మద్రాసు మోటారు స్పిరిట్ అమ్మకపు పన్ను విధింపు చట్టమును సవరించి, తెలంగాణా ప్రాంతంలోని 1358 ఫసలీ హైదరాబాదు మోటారు స్పిరిట్టు అమ్మకం పన్ను విధింపు చట్ట నిబంధనావళిని సవరించి క్రమపరచబడుచున్నది. రాష్ట్రం అంతటను ఒకే విధమైన చట్టమును అమలు చేయవలెనను తలంపుతో హైదరాబాదు నిబంధనావళిని రద్దుచేసి, అనగా ఈ తెలంగాణా ప్రాంతంలో ఉన్న చట్ట ఉద్దేశమును రద్దుచేసి, ఆంధ్ర చట్టమును అనువర్తింప చేస్తున్నారు. అయితే హైదరాబాదు చట్ట నిబంధనావళిని రద్దుచేసి తెలంగాణా ప్రాంతానికి 1939 మద్రాసు మోటారు స్పిరిట్టు అమ్మకం పన్ను విధింపు చట్టమును అనువర్తింప చేయుటకు ప్రభుత్వం నిశ్చయించింది.

సదరు తెలంగాణా చట్టము ప్రకారము వేర్వేరు రకముల aviation spirists పై వేర్వేరు రకముల పన్నులు విధింప బడుచున్నవి. తెలంగాణా ప్రాంతములో యిప్పుడు అన్ని రకముల aviation spirits పై గ్యాలనుకు పన్ను 0—19 నయా పైసలు.

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—నా దగ్గర యీ కాగితము లేదు కాబట్టి వారికి, సరిగా యీ విషయము అర్థము కాలేదు ఈ కాగితములో వున్నది నేను explain చేసి చదువుతాను. ఇప్పు డాంధ్రలో వున్న పన్ను యెంత? తెలంగాణాలో వున్నదెంత ? యిప్పుడు మేము propose చేసిందెంత ? అనేవి అన్నీ తెలిస్తే వారికి అర్థమౌతుంది.

| | | Andra | Telangana | Propoced |
|---|---|---|---|---|
| (1) | Petrole other than avation spirit | 0-6-0 | 00-37 | 00.37 |
| (2) | Diesel oil other than aviation spirit | 0-3-0 | 0-3-0 | 00.19 |
| (3) | Motar spirit other than petrol diesel oil aviation spirit బహుశా ల్యూబ్రికేటింగు ఆయిలు లాంటిది | 0-3-0 | 0-4-0 | 00.19 |
| (4) | Aviation spirit filling within the category of Petrol: N. B. ఆంధ్రలో మేము 5,6 సంవత్సరాలు నుంచి exemption యిస్తు 0-3-0 వసూలు చేసే వారము. ఆ exemption అవసరము యిక వుండదు. | 0-6-0 | 0-3-0 | 00.19 |
| (5) | Aviation Spirit not filling with in the category of Petrol. | 0-3-0 | 0-3-0 | 00.19 |

యీ రేట్లకు సంబంధించినంతవరకు తెలంగాణాలో ఒకచోట 0—4—0 వున్నది. 0—3—0 అయినది. ఇంకా మేము రూ. 0—6—0 చొప్పున వసూలు చేయకుండా వున్న వాటిని తెలంగాణాలో రూ. 0—3—0 సమానము చేసినాము యీ కాగితము కావాలంటే మీరు తీసుకొని చదవవచ్చు.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:— Government of India వారు ఒప్పుకొనక పోతే మనము యిక్కడ వసూలు చేయడానికి వీలులేదా ?

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—ఆంధ్రలో exemption యిచ్చి కొంత consideration చూపించినాము. తెలంగాణాలో రూ. 0—3—0 చొప్పున ఎప్పుడు వసూలు చేసేవారు. ఇప్పుడు ఆంధ్ర ప్రదేశ్ అంతా 0—19. నయా పైసాల చొప్పున వసూలుచేయవలసి వస్తుంది.

శ్రీ కె. యల్. నరసింహారావు: —వారు యిప్పుడు చదివిన ఆక్టులో ఈ oils పై taxes తప్ప వేరే యింకేమీ లేదని హామీ యిస్తారా ?

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—ఏమీ లేదు ఎక్స్ పెట్రోలు మీదే రూ 0—6—0 చెసి రూ. 0-37 నయా పైసలు వుంది తక్కిన వాటి అన్నింటి మీద 19 నయాపైసలు వుంటుంది.

శ్రీ బసవ మానయ్య :— " ఈ aviation spirit oil పై అక్కడ ప్రకారము ఆంధ్రలో రూ. 0—6—0 వుండెను, మేము రూ. 0-3-0 తీసుకున్నాము, exemption యిచ్చాము" అని మంత్రిగారు అన్నారు

మిస్టర్ స్పీకర్.— Exemption యిచ్చారు. అక్కడ రూ 0—3—0 ఎప్పుడూ వసూలు చేస్తుండే వారు.

శ్రీ బసవ మానయ్య.—అంతవరకు exemption యిస్తే తెలంగాణాలో రూ. 0—3—0 వసూలు చేయబడినదింతవరకు. . . . . . .

మిస్టర్ స్పీకర్:—అందు చేతనే తెలంగాణా పన్ను యిప్పుడు ఆంధ్రపై వేయబోతున్నారు.

శ్రీ బసవ మానయ్య:—అసలు లేకుండా exemption యిచ్చారు ఇప్పుడు రూ. 0—3—0 వేయబోతున్నారు. యీ పూర్తి exemption యిచ్చిన విషయంలో వాటికి సంబంధించిన కొన్ని కాగితాలు సభ్యులకు అందివ్వబడలేదని, Printలో యేవోపొరపాటులు జరిగినాయని ప్రభుత్వమే ఒప్పుకుంటున్నది. యీ పరిస్థితుల దృష్ట్యా యీ బిల్లును select committee కు పంపి వారికి రెండు మూడు రోజాలు వ్యవధి యిస్తే యింకా యిటువంటి పొరపాటులు ఎన్ని వున్నాయో అంతా సరిగ్గా చూచివారు సమగ్రముగా యీ బిల్లును రూపొందించగలరు. అందుచేత 10 మంది సభ్యులతో ఒక సెలక్టు కమిటీ వేసి యీ బిల్లును వారికి refer చేయవలసినదిగా ప్రభుత్వాన్ని నేను కోరుతున్నాను

*Mr. Speaker :* The question is :

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be referred to a Select Committee."

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be taken into consideration at once."

The motion was adopted.

*CLAUSE 2.*

*Mr. Speaker :* The question is :

That Clause 2 stand part of the Bill."

The motion was adopted.

Clause 2 was added to the Bill.

*CLAUSE 3.*

*Mr. Speaker :* The question is :

"That Clause 3 stand part of the Bill."

The motion was adopted.

Clause 3 was added to the Bill.

*CLAUSE 4.*

*Mr. Speaker :* The question is :

"That Clause 4 stand part of the Bill."

The motion was adopted.

Clause 4 was added to the Bill.

*CLAUSE 5.*

*Mr. Speaker :* There are no amendments to this clause also...... .

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—అధ్యక్ష, యీ 5వ క్లాజులో ఏవోకొన్ని definitions యిచ్చారు. "Power Alchohol"—Mixture of power Alchohol అని ప్రభుత్వము ఎజెండాలో తయారుచేసిన వరుసకార్యక్రమాన్ని అనుసరించలేదు. మధ్యలో మాకు circulate చేయని amendments కొన్నితెచ్చిపెట్టుతూ వున్నారు. అందుచేఏప్పుడేబిల్లు చర్చకువస్తుందో అందులో యే amendments క్రొత్తగా ప్రతిపాదించుతున్నారో ముందుగా తెలుసుకొనడానికి మాకుఅవకాసము లేకుండాపోతున్నది. యీ Import"అనే Definition ఎందువల్ల యిక్కడ తీసుకొనివచ్చినారో తెలియకుండా వున్నది. దానిని explain చేయువలసిన అవసరము వుంది. 'Motor Spirit'అనేదానికి కూడ definiton మార్చినారు. 'Import' అనేదానికి Part -(A), (B) States లేవుగనుక మార్చినారనుకుంటాను. కానియిక్కడ (C) ఎందుకుపెట్టినారో అర్థముకావడములేదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—మోటారు స్పిరుటు అనేదానిలో పవర్ ఆల్కాహాలుపెట్రోలుమొదలయినవన్నీ చేరినవని అన్నారు. దీనివల్ల ఇబ్బందికలుగుతుందనుకుంటాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—పెట్రోలు, పవర్ ఆల్కాహాలుఅనేటటువంటిది ఎంతకాలంగానో మోటారు స్పిరిట్సు క్రింద వర్గీకరింపబడ్డాయి. బహుశా ఎవరైనా కోర్టులో రిట్‌వేసివుంటే ఏవిధమైనటువంటి యాంబిగ్యుయిటీ లేకుండుటకుగాను యీడెఫినిషన్ ఇచ్చివుంటారు. ఇటువంటి వాటికై 6 అణాలు పన్ను విధించమని అంటున్నాము.

*Mr. Speaker :* The question is :

"That Clause 5 stand part of the Bill."

The motion was adopted.

Clause 5 was added to the Bill.

*CLAUSE 6.*

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—ఇదిఏడాప్టేషన్ బిల్లుకాకుండా ఇప్పుడున్న పన్నులను తెచ్చేదిగా వున్నది. ఇదివరకు ఉన్న 6 అణాలకు బదులు 37 నయాపైసలు అనివున్నది.

డాక్టర్ బి గోపాలరెడ్డి — 6 అణాలు అంటే 37 1/2 నయాపైసలకు సమానము. కానిమేము ముప్పై ఏడుమాత్రమే విధిస్తున్నాము.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—ఇందులో ఏదో కన్‌ఫ్యూజను ఉంది. ఒరిజినలు ఆక్టులో చూపించినరేట్లకూ యీ బిల్లులో సూచించినవాటికి తేడాకన్పిస్తున్నది. అయితేయింతకుముందే నోటిఫికేషనుద్వారా రేట్లు పెంచామని చెప్పారు. ఆ వివరాలన్నీ మాదగ్గరలేకపోవడమువల్ల అన్నివిషయాల నుగురించి సమగ్రంగా చర్చించడముఅవుతోంది.

*Sri Vavilala Gopalakrshnayya* : Mr. Speaker, Sir, I have given notice of the following amentment .

> "In sub-clause (i) (b) of Clause 6 for the words 'Nineteen Naye Paise' substitute the words 'Twenty-five Naye Paise."

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య .—విమానాలయానానికి వుపయోగించే నూనెమీద తక్కువ పన్ను విధించారు. దానిని పెంచవలెనని నా సవరణ.

డాక్టర్ బి. గోపాలరెడ్డి .— బిల్లులో సూచించినదానికన్న ఎక్కువ పన్ను విధించాలని శ్రీ గోపాలకృష్ణయ్యగారు సూచిస్తున్నారు. ఇదినిబంధనలకు విరుద్ధము. గవర్నరు గారి ఆమోదము ఉంటేనేకాని యీసవరణను ప్రతిపాదించరాదు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—ప్రజా సామాన్యము నిత్యము ఉపయోగించే బస్సులను నడప టానికి కావలిసిన నూనెపై హెచ్చుపన్ను విధిస్తున్నారు లక్షాధికారులు , ధనవంతులు ఏదో లగ్జరీగా చేసేవిమానయానాలకు కావలసిన నూనెపై తక్కువ పన్ను ఉంది. యీ పన్నులను పెంచేనిమిత్తమై నేనీ సవరణను ప్రతిపాదించారు.

మిష్టర్‌స్పీకర్ :—ఇప్పుడున్న 19 నయాపైసలను 25 నయాపైసలకు పన్నుహెచ్చుచేయాలం టున్నారు. పన్నుహెచ్చు చేయుటకు గవర్నరుగారి పర్మిషన్ కావాలి. కాబట్టి దానిని అంగీకరించ జాలను. ఈ సవరణను తోసివేస్తున్నాను.

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—ఇదివరకు ప్రైవేటు విమాన కంపెనీలు ఉండినవి. వారంతాతమకు నష్టం వస్తున్నదని భారతప్రభుత్వమునకు చెప్పుకుంటూవచ్చినారు. తరువాత విమానయానము జాతీ యము చేయబడినది. అన్నిసర్వీసెస్ కేంద్ర ప్రభుత్వంవారు తీసుకొన్నారు. దీనివల్ల ప్రభుత్వమునకు దాదాపు 2 కోట్లు నష్టమువస్తున్నది. కావలిసినఆక్యుపెన్సీ రేషియోలేనందున విమానములు చాలాసార్లు ఖాళీగా పోతున్నాయి. Operational expenses కూడా ఎక్కువ. అనుకున్నంత లాభముగాలేదు. అందువల్ల కేంద్ర ప్రభుత్వమువారి డిప్యూటీ మినిస్టరుకూడా వచ్చి స్వయముగా మాతోమాట్లాడి exemption యివ్వవలసినదని ప్రార్థించారు, బలవంతంచేశారు. అప్పుడు మద్రాసులోనే మేము ఒప్పుకొన్నాము. కాని హైదరాబాదులో వసూలుచేస్తూనేవున్నారు. కొంతకాలం exemption యిచ్చి తరువాత withdraw చేశారు, హైదరాబాదులో ఉన్నదికాబట్టి వాల్తేరులోకూడా యివ్వమని కోరవచ్చును. దీనిని మూడణాలకు తగ్గించి కేంద్రప్రభుత్వమునకు 6 అణాలనుంచి 3 అణాలకు తగ్గించాము, వాల్తేరులోకూడా యివ్వండి, బీగంపేటలో యిస్తున్నారు—అని వ్రాయదలుచుకున్నాము.

మిస్టర్ స్పీకర్ :—విమానయానంజాతీయమైన తరువాత యిది కేంద్ర ప్రభుత్వముక్రిందనే ఉంటుందికదా ?

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—సెంట్రలుగవర్నమెంటు జాతీయంచేసిందికనుక అందులో వచ్చే లాభనష్టాలు సెంట్రల్ గవర్నమెంటుకుపోతాయి. కాబట్టి గవర్నమెంటుకే వచ్చేటపుడు మనము ఎందుకు అడగాలనేది తమరుసూచిస్తున్న పాయింటు. కాని నేను మనవి చేసేది —సెంట్రలుగవర్నమెంటుకు నష్టమువస్తే పూడ్చుకొనే అవకాశంఉన్నది అదే, సామాన్యుడికి దండుగ వస్తోందంటే యిచ్చేవారు లేరు ఏదైనా ధర్మసంస్థ మోటారు సర్వీసు నడుపుతుంది. దానికినష్టమువస్తే నష్టము వచ్చింది కాబట్టి తీసివేయాలంటే తీసివేస్తున్నామా ? అదితీసివేయనప్పుడు, సెంట్రలుగవర్నమెంటు విషయంలో కూడా తీసివేయడం న్యాయంకాదు.

డాక్టర్ బి గోపాలరెడ్డి :—ఇండియాలో విమానసర్వీసు ఉండవలెనా ? అక్కరలేదా ?

శ్రీవావిలాల గోపాలకృష్ణయ్య :—ఉండాలి. దానిమీద లాభంవస్తే ఉపయోగపరుచుకోమనండి. నష్టమువస్తే యింకొక రూపాయి, రేటు ఎక్కువ చేయమనండి. ఇప్పుడుజాతీయం అయితే ఏమంటున్నారు ? —ఇదివరకు ఆంధ్రలో ఉన్న 7 1/2 దమ్మిడీలుపనికిరాదు. నష్టంవస్తోందనే అనుమానం ఉన్నది. కనుక 10 దమ్మిడీలో 9 దమ్మిడీలో చేయడానికి సంసిద్ధమవుతున్నాము, అని ప్రకటనలుయిస్తున్నారు. అందువల్ల నేషనలైజేషను వద్దనేసమస్య ఎక్కడవచ్చింది ? దానికి మేము వ్యతిరేకించామా ? ఆంధ్రదేశంలో విమానకేంద్రాలు ఏర్పరచమనండి. ఏర్పరచమనే మేము అడుగుతున్నాము. కాని ఆవచ్చే లాభమురాష్ట్రానికి రావడంలేదు. మనకు నష్టమువస్తోందని అడుగుతున్నాము. మనము నష్టము ఎందుకు భరించాలి ? లేకపోతే మనకేమయినా కాంపెన్సేషన్ యిస్తారా ? సెంట్రలుగవర్నమెంటు యిస్తామంటే మనకు అభ్యంతరములేదు. సెంట్రలు గవర్నమెంటుజాతీయం చేసిందికనుక, వాళ్లప్రయోజనాలకు ఉపయోగపడుతుందికనుక, ఇతరులు చవుకగా ప్రయాణంచేయుటకు వీలవుతుందికనుక వాళ్లకుయిబ్బంది లేకుండా చేయటానికి మనము నష్టపడతామనేది సరైనపద్ధతికాదని నాభావము.అందువల్ల మనము exempt చేసినప్పుడు మనకు రిబేటు యిస్తారాఅని సెంట్రలుగవర్నమెంటును అడుగుతారా ? అనినేనుఅడుగుతున్నాను.

మిస్టర్ స్పీకర్ :—ఏమయినప్పటికీ యీ సవరణ out of order కనుక చర్చ అనవసరము. గవర్నరుగారి పర్మిషన్ లేనిదే పన్నుహెచ్చించమని అడుగుటకు వీలు లేదని నేనుమొదటనే రూలింగ్ యిచ్చాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—సవరణను రూలు అవుటుచేశారుగాని, అసలు క్లాజును మేము వ్యతిరేకించుటకు రూలుఅవుటుచేయడానికి వీలులేదుకదా ? అందువల్ల నేను క్లాజును వ్యతిరేకిస్తూవరిస్థితి యీవిధముగావున్నదని , దానికిమంత్రిగారు ఏమిజవాబుచెబుతారని అడుగుతున్నాను. ఆక్లాజుకు మేము వోటు చేయవలెను కదా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి :—ఆరుఅణాలది మూడుఅణాలు చేస్తున్నాము. మూడుఅణాలు మీరు యివ్వండి అని అడగబోతున్నాము. బేగంపేటలో యిచ్చారు కాబట్టి వాల్తేరులోకూడా యివ్వండి అని అడగబోతున్నాము. ఇది ఏప్రిలు 1 వతేది నుంచి అమలులోకివస్తుంది. అప్పటినుంచి విత్‌డ్రా చేస్తున్నాము కాబట్టి "యివ్వండి" అని అడగబోతున్నాము.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య :—డీసెలు కార్లమీద 6 అణాలు వసూలు చేస్తున్నారు. దీనికి 3 అణాలే వసూలు చేయబోతున్నారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— విమానాలకు ఒకగ్యాలను పెట్రోలు ఒకటి రెండు మైళ్లు వస్తుం దేమో. ఇక్కడనుంచి డిల్లీకి పోవాలంటే 250 గ్యాలనుల వరకు తీసుకు పోవాలి. అందువల్ల ఏవియేషన్ స్పిరిట్‌కు మూడు అణాలు మాత్రమే వసూలు చేస్తున్నాము. గౌ. సభ్యులు చెప్పేది-ప్రజానీకము పోలేరు కాబట్టి విమానాలు అవసరం లేదని చెబుతున్నట్లు తోస్తుంది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య:—ఉండాలి కాని ఎక్కేవాళ్లే అడబ్బు పెట్టుకోవాలి. ఈ ప్రొవిజో తొలగించాలని నా అభిప్రాయము. I therefore beg to move :

'Delete the existing Proviso'.

మిస్టర్ స్పీకర్:—మొదటిది ఒప్పుకుంటున్నారా ?

"Provided that the State Government may from time to time by notification fix any other rate at which the tax shall be payable."

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య:—అది మాకు ఇచ్చిన దానిలో లేదు. అది ఒరిజినల్ యాక్టులో ఉన్నది. మాకు యిచ్చిన దానిలో further proviso ఉన్నది. అందువల్ల యీ further proviso తీసివేయమని అడుగుతున్నాను. రెండు ప్రొవిజన్సు దీనికి సంబంధించినవి కనుక మొత్తంగా దీనికి న్యలిరే కిస్తున్నాను. ఎందువల్లనంటే వేరే నోటిఫికేషన్ గవర్నమెంటు యివ్వ నక్కరలేదు. ఇదివరకు నోటిఫికేషన్ సరాసరి చేయవచ్చుననే వాళ్ళు ఇప్పుడు ముందు నోటిఫికేషన్ యిచ్చి తరువాత యిక్కడకు వచ్చి ఒప్పుకోనండి అంటున్నారు. ఇది దాదాపుగా ఎడంచెయ్యి తీసి పుర్ర చెయ్యి పెట్టమన్నట్లున్నది. అసలు నోటిఫికేషన్‌కు అధికారం తీసుకుంటే లీగల్‌గా చిక్కు వస్తుందని తెలుసు. అందువల్ల నోటిఫికేషన్‌కుఅధి కారం తీసుకొనుటలేదు. నోటిఫికేషన్ చేసిన తరువాత అసెంబ్లీ ముందు పెడతానుని, నోటిఫై చేసినది రాటిఫై చేయమని అంటున్నారు. అందువల్ల యీ నోటిఫికేషన్, రాటిఫికేషన్ లేకుండా లెజిస్లేషన్ చేస్తే సరిపోతుంది. అందువలన ఆ రెండు ప్రొవిజన్సు తీసివేయమని కోరుతున్నాను. మొత్తము యీ క్లాజును అప్పోజు చేయవలసియున్నది.

*Mr. Speaker :* Motion moved.

శ్రీ కె. యల్. నరసింహారావు:— స్పీకర్ సర్, శ్రీ గోపాల కృష్ణయ్యగారు అమెండ్‌మెంట్ తీసుకు రావటంలో పొరపాటు పడ్డారని నేను అనుకొంటాను. ఎందుకంటే, వారు ఎమెండింగ్ బిల్లుకు అమెండ్‌మెంట్ తీసుకు వచ్చారు. అసలు యాక్టులో యీ ప్రొవిజో ఇంకా ప్రమాదకరంగా ఉంది. ఈ ప్రొవిజో కొత్తగా యీ అమెండింగ్ బిల్లులో వచ్చినట్లయితే, దానిని డిలిట్ చేయటానికి మేమంతా అను కూలంగా ఉండేవారము. కాని, అసలు ప్రిన్సిపల్ యాక్టులోని యీ ప్రొవిజో ఇంకా ప్రమాదకరంగా ఉంది. "Provided that the State Government may from time to time by notification fix any other rate at which the tax shall be payable."

అన్నది అసలు యాక్టులో ఉన్నది. దానితో పాటు the second proviso reads :

"Provided further that no such notification shall come into force until approved by a resolution of the Legislative Assembly."

మొదటి దానిని as it is గా గవర్నమెంటువారుకూడా ఉంచుతున్నారు. దానికి అమెండ్‌మెంటు లేదు. రెండవ దానిని "Provided further that no such Notification shall be made unless a draft thereof has been approved by the Legislative Assembly." అని చేంజి చేస్తున్నారు అంటే ఇదివరకు ఉన్నదానికన్నా, ఇదికొంత డెమాక్రటిక్ చేంజి అవుతుందని నేను అర్థం చేసుకుంటున్నాను. మొత్తానికి దీనిని ప్రభుత్వం ఉపసంహరించుకుంటే బాగానేడంటుంది. ప్రభుత్వం ఆ విధంగా చేయవలసి ఉన్నది కాని అట్లా చెయుటములేదు. మమ్ములను తొందర పెట్టినందునల్ల మేము అమెండ్‌మెంట్ ఇవ్వలేక పోయాము. ఇప్పుడు మూవు చేయబడిన అమెండ్‌మెంటు ఉపసంహరించుకొంటే బాగుంటుంది. కాబట్టి గోపాల కృష్ణయ్య గారు దాని విషయం ఆలోచిస్తారని ఆశిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్:—కావాలంటే, నేను ఆ ప్రొవిజో ఒటుకు పెడతాను. మీరు అపోజు చేయవచ్చును. మీరు దానిని డిలీట్ చేయాలని అమెండ్‌మెంట్ ఇస్తారు. అంతేకదా—ఆ అమెండ్‌మెంట్ ఇవ్వకపోతే మీకు వచ్చే నష్టము ఏమిలేదు.

శ్రీ కె. యల్. నరసింహారావు:—ఆ ప్రొవిజో ప్రిన్సిపుల్ యాక్టునుంచి పోదండి.

మిస్టర్ స్పీకర్:—మీకు "అపోజు చేయుటానికి" పర్మిషన్ ఇస్తాను.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—ప్రిన్సిపుల్ యాక్టుకు సంబంధించిన దానిపై మనం ఒటు చేయడానికి ఇప్పుడు వీలు లేదు. ఎందుకంటే ఇప్పుడు ప్రవేశపెట్టింది ఎమెండింగు బిల్లు. ఇప్పుడు ఇది ప్రిన్సిపుల్ యాక్టుకు అమెండ్‌మెంట్‌గా పెట్టారు. ఇది పోతే ప్రిన్సిపుల్ యాక్టులోది as it is గా ఉంటుంది. మీరు అనుమతి ఇస్తే, మంత్రిగారికికూడా సదుపాయంగా ఉండే ఒక చిన్న అమెండ్‌మెంట్ సూచిస్తాను. ఈ రెండు ప్రొవిజోలు తీసివేస్తే, యీ ప్రొవిజో కూడా అక్కరలేదు. గోపాల కృష్ణయ్యగారి ఉద్దేశంకూడ అదే. ప్రభుత్వము ఎట్లాగు అమెండింగ్ బిల్లు ద్వారా అసెంబ్లీముందుకు రావచ్చును. నోటిఫికేషన్ ద్వారా అసెంబ్లీముందుకు రావటం ఏమిటి?

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—ఎమెండింగ్ బిల్లుకు మూడు స్టేజస్‌ఉన్నాయి. "టేకెన్ ఇన్‌టు లా టేకెన్ ఇన్‌టు కన్‌సిడరేషన్"— ఇదంతా ఉంటుంది. నోటిఫికేషన్ అంటే అది రిజల్యూషన్ ద్వారా సభ్యుల ముందుకు వస్తుంది. సభ్యులు ఆమోదించగనే అది అమలులోకి వస్తుంది. ఎమెండింగ్ బిల్లు అంటే దానికి చాలా తతంగం ఉన్నది.

శ్రీ కె. యల్. నరసింహారావు:—స్పీకర్, సర్, తాము నేను ఒక అమెండ్‌మెంట్ మూవు చేయుటానికి యాక్సెప్ట్ చేస్తానన్నారు కాబట్టి యీ సవరణను నేను మూవు చేస్తున్నాను.

I beg to move :

"Delete both the provisos to section 3 of the Principal Act."

*Mr. Speaker :* Motion moved.

వారి జోరల్ అమెండ్‌మెంట్ మూవు చేయటానికి నేను ఆమోదించాను గనుక ఇక యితర మెంబర్లు మాట్లాడవలసిన అవసరంలేదు. అని అంటున్నాను. కాబట్టి ఇప్పుడు ఆ అమెండ్‌మెంట్లును ఒటింగ్ పెడతాను.

శ్రీ కె యల్. నరసింహారావు.—అధ్యక్షా, నాది ఒక మనవి. నీరు వానిలాల గోపాల కృష్ణయ్య గారి అమెండ్‌మెంటుకు బదులు యీ అమెండ్‌మెంటును ఒటింగుకు పెడితే నష్టం వస్తుంది. కాబట్టి మా అమెండ్‌మెంట్సును వేరువేరుగా ఒటింగుకు పెట్టాలి.

*Mr. Speaker :* The question is :

"Delete the existing proviso."

The motion was negatived.

*Mr. Speaker :* The other amendment of Sri Vavilala Gopalakrishnayya was already ruled out of order.

Regarding the amendment of Sri K. L. Narasimha Rao, I will put that amendment to vote

The question is :

"Delete the provisos to Section 3 of the Principal Act."

The motion was negatived.

*Mr. Speaker :* The question is :

"That Clause 6 stand part of the Bill"

The motion was adopted

Clause 6 was added to the Bill.

*CLAUSE 7. to 11.*

*Mr. Speaker :* The question is :

"That Clauses 7 to 11 stand part of the Bill."

The motion was adopted.

Clauses 7 to 11 were added to the Bill.

*CLAUSE 12.*

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు:—Clause 12 ప్రకారంగా గవర్నమెంటు చేస్తేమళ్లీ House ముందుకు రానక్కర లేదా ?

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—అన్‌ఫోర్‌సీన్ డిఫికల్‌టీస్ వస్తే, వాటిని రిమూవ్‌చేయటానికి ప్రభుత్వానికి అధికారం ఉండవలెను. As far as possible, it will be reported to the Assembly.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు —మంత్రిగారు చెప్పేవన్నీ యీ బిల్లులోనే ప్రొవైడ్ చేస్తే బాగుంటుంది.మనం అన్ని యాక్ట్సులో అలాగే పెడుతున్నాము. అదేవిధంగా ఇందులో కూడా ఇన్సర్ట్ చేస్తే బాగుంటుంది.

డాక్టర్ బి గోపాల రెడ్డి —ఒక అడ్మినిస్ట్రేటివ్ ఆర్డరు ఉన్నదనుకోండి. దానిని అసెంబ్లీకి రిపోర్టు చేయవలసిన అవసరం లేకపోవచ్చు ఏమైనా, డిఫికల్టీస్ వస్తే వాటిని రెక్టిఫై చేసుకుంటారు. ఏమైనా, ఇది మూడు సంవత్సరాలే ఉంటుంది క్రింద యీ విధంగా ఒక ప్రొవిజోకూడా ఉంది.

"Provided that the power conferred by the sub-section shall not be exercisable after the expiration of three years from the commencement of this Act."

It all depends on the nature of the thing ఆమూడు సంవత్సరాల లోపల ఏ డిఫికల్టీస్ రాకపోతే, నాలుగో ఏడు, ఐదవ ఏడుకూడ డిఫికల్టీస్ రావనే అర్థం. అందువల్ల ఇది ఆపరేషన్‌లో ఉండదు

శ్రీ యం. నాగిరెడ్డి— (మాచెర్ల) :—ఇంత వరకు వచ్చిన బిల్సులో ఏదైనా ఒక Act ను అనువర్తింప చేయటానికి Rule making power అనేది పెట్టుకుని, రూల్సు frame చేసి, అవిAssembly ముందుకు తీసుకుని రావడం ఉంటూ ఉండేది. ఇప్పుడు ఇచ్చిన బిల్లులో ఉన్నది ఏమిటంటే రూల్సు frame చేయటానికి Act ను అనువర్తించి, Rules అనేవి కాకుండా, Administrationలో ఏదైనా difficulty వస్తే Rules ను తయారు చేసుకొని, ఆ రూల్సు ప్రకారము చేయుడము ఉంటుంది. ప్రతి బిల్సులో కూడ అదే వస్తున్నది. కాని, ఇందులో ఆ Rule making power లేదు.

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—Rule making power అసలు Original Act లోనే ఉంటుంది. దాన్ని ఇప్పుడు ఏమీ సవరణ చేయడములేదు Rules frame చేసే అధికారము ప్రభుత్వానికి ఉన్నది. ఆ రూల్సును frame చేసిన తరువాత, వాటిని ఎసెంబ్లీ ముందుకు తీసుకుని రావడము, అది అంతా Original Act లోనేఉన్నది. దాన్ని సవరణ చేయడము లేదు.

శ్రీ యం. నాగిరెడ్డి—Rule making power ప్రభుత్వానికి ఉన్నప్పుడు, Administration ఏదైనా difficulty వచ్చినప్పుడు, అది overcome చేయటానికి ఈ విధముగా చేస్తున్నామని చెబుతున్నారు. అలాంటి అధికారము ఉన్నప్పుడు, ఇప్పుడు దాన్ని ఆ విధంగా చేయవచ్చు. అంతేకాని, ఇప్పుడు దానిని మార్చాలని చెప్పి దానికి ఏదో ఒక amendment మాదిరిగా ఒకదానిని తీసుకొనివచ్చి నప్పుడు కూడా, దానిని మరల యీ ఎసెంబ్లీ ముందుకు తీసుకొని రావద్దా ?

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—యాక్టుకు గాని, రూల్సుకు గాని అతిక్రమించి ఏదైనా ఒక difficulty వచ్చిందనుకోండి. రూల్సుకు, యాక్టుకు సమన్వయము లేకుండాఉంటేనే, అప్పుడు ప్రభుత్వము దానిని rectify చేసికోవలసి ఉంటుంది.

శ్రీ యం. నాగిరెడ్డి:— ఆ Act కు ఒక amendment తీసుకొని వచ్చినప్పుడు, ఆ క్లాజుకు కూడా ఒక amendment తీసుకొని రావచ్చుకదా ?

శ్రీ బసవ మానయ్య:—రూల్సుకు, బిల్సుకు, యాక్టుకు అన్నింటికి అతీతముగా ఏదైనా difficulty వస్తే, మరల వేరే యాక్టునే ఒక దానిని తీసుకొని వస్తే బాగా ఉంటుందిగదా. కాని దాని powerఅంత తీసుకొని, మాకుఅధికారము ఉన్నదిగనుక యాక్టులో ఏ section అయినా మార్పు చేసు కుంటాము, లేకపోతే ఏదైనా సరే కలుపుకుంటాము అంటే ఎట్లా ?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—Administrationలో ఇదివరకు మనముఎప్పుడుకూడ అనుకోనటు వంటి difficultes ఏవైనా వస్తే, రూల్సులోగాని, యాక్టులోగాని లేనటువంటిది గాని వస్తే, అంటే, ఒక ఉదాహరణ చెప్తాను. రేపు మార్చి 31 వ తేదికి మన ఎసెంబ్లీలో పని అయిపోతే, మరల మనము ఏ జూలై నెలలోనో, ఆగస్టు నెలలోనో, నాలుగు అయిదు మాసాల దాక మరల ఇక్కడ అసెంబ్లీలో సమావేశము కాకుండా పోతాము అనుకోండి. అప్పుడు ఒక వేళ assembly prorogue అయిపోయి ఉంటుంది. prorogue అయితే, మరల సమావేశము అయ్యేలోగా ఎసెంబ్లీ ఉండదు గనుక ఈ లోగా ఏదైనా difficulty వస్తే ఆ difficulty meet చేయటానికి గవర్నరుగారు ఒక Ordinance issue చేయవలసి ఉంటుంది.

శ్రీ పిల్లల మర్రి వెంకటేశ్వర్లు:—గోపాల రెడ్డిగారు ఒక చిన్న విషయము గమనిస్తే సరిపో తుందనుకొంటాను—అసలు ఈ క్లాజు అవసరముండదని అనుకుంటాను. ఎందువల్ల నంటే యిదివరకు యాక్టులో యీ క్లాజు లేదు. 1933 లోనో, 1939లోనో, యీ యాక్టులు ఎప్పుడు చేశామోకాని .ఇందులో ఈ క్లాజు లేకుండానే ప్యాసు చేశాము. ఈ క్లాజు లేనందువల్ల, యింతవరకు ఏ అవాంతరము వచ్చి మీద పడలేదు.ఎప్పటికైనా ఏదైనా అవాంతరము వచ్చి మీద పడుతుందేమో, వచ్చిపడితే ఎట్లా ఏమి చేయడము అని ఊహించుకొని యిప్పుడు యీ క్లాజును చేర్చుతున్నామని అంటే అలాంటి చిక్కు వస్తే, గోపాలరెడ్డిగారు ప్రజాస్వామ్యవాదులు గనుక వారుచేయక పోవచ్చు. కాని ఏ లక్ష్మణదాసుగారిలాంటి వారో వస్తే, అప్పుడు ఏమవుతుంది?

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—ఆంధ్ర దేశములో అన్వయించే ఈ యాక్టును, కొత్తగా తెలంగాణా లోని తొమ్మిది జిల్లాలలో దానిని అన్వయింప జేస్తున్నాము. ఈ యాక్టు 1939 వ సంవత్సరమునుంచి ఆంధ్రలో అమలులో ఉన్నది. ఈయాక్టును తెలంగాణాకు అన్వయింప చేసేటప్పుడు ఏ ఏ difficulties వస్తాయోనని నేను ఊహించడము లేదు. difficulties రావాలని నేను ఆశించడము లేదు. కాని ఆంధ్రలో అమలులో ఉన్న యాక్టును, తెలంగాణాలోని తొమ్మిదిజిల్లాలోను అమలు పరచదలచుకున్నాము గనుక, ఇది అమలు జరిపేటప్పుడు ఏ ఏ చిక్కులు వస్తాయోనని, ముందుగా as an abundant caution, ఆ చిక్కులు over come చేయటానికి యీ క్లాజును చేర్చుతున్నాము. అంతేకాని దీనిని ఉపయోగించలన్న ఉద్యేశముతోకాదు. ఆంధ్ర దేశములో ఈ యాక్టు అమలు జరిగే టప్పుడు ఏ difficulties కూడా రాలేదనే అనుకుంటున్నాను. ఒక వేళ ఏ వైనా వస్తే, అప్పుడు యీ క్లాజును ఉపయోగించుకోవలసి ఉంటుంది.

శ్రీ కె. యల్. నరసింహారావు:—ఈ క్లాజు అవసరము లేకుండా, ఏదైనా చిక్కు వస్తే, గవర్నరు గారు ordinance issue చేయువచ్చును గదా ! అప్పుడు ఇది సులభ మార్గమే కదా! ఆ విధముగా ఎందువల్ల చేయకూడదు ? అంతేకాని ఇలాంటి క్లాజును పెట్టడమువల్ల, ఎసెంబ్లీకి ఉన్న హక్కులను తగ్గించటానికి ప్రయత్నించినట్లు అవుతుంది. కాబట్టి యీ క్లాజుతో అవసరము లేకుండా ordinance ద్వారానే ఆ చిక్కులు over come చేయవలసిందిగా కోరుతున్నాను.

డాక్టర్ బి గోపాల రెడ్డి —Ordinance issue చేయాలంటే Assembly prorogue చేయవలసి ఉంటుంది Prorogue చేస్తే, అప్పుడు సభ్యులువేసిన ప్రశ్నలు, బిల్లులన్నీకూడా పిల్లిఎత్తుకు పోతుంది కాబట్టి అలాంటి procedure ఎందుకుఅని యీక్లాజుద్వారా ఆపనులుసులభముగా చేసుకోవచ్చు నని చేర్చాము.

శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు :—అందుకనే, అవి అన్ని పిల్లి ఎత్తుకొని పోకుండా యీ క్లాజుకు ఒక్క చిన్నవాక్యము చేర్చివేసరిపోతుంది. అన్నిపనులు చేసినట్లుగా, ఇందాక Notification gazette లో ప్రచురించుతామని అన్నట్లుగా, యింయులో అది చేర్చితే లప్పుడు ఏలాంటి చిక్కులు రావు. ఒక వేళ అంతగా ఏదైనా అవాంతరము వచ్చి మీద పడితే, అప్పుడు మేమందరము దానిని ఆ అవాంతరములో పడి కొట్టుకొని పోనిస్తామా ?

*Dr. B. Gopala Reddi :* After all, this is a very small matter. We need not further discuss it.

*Mr. Speaker :* The question is:
"That Clause 12 stand part of the Bill."
The motion was negatived.

*Sri K. Venkata Rao :* I demand a division.
The House then divided.
Ayes — 63, Noes — 24, Neutral — 1.
The motion was adopted.
Clause 12 was added to the Bill.

## *CLAUSE 13.*

*Mr. Speaker :* The question is:
"That Clause 13 stand part of the Bill."
The motion was adopted.
Clause 13 was added to the Bill.

## *CLAUSE 1.*

*Mr. Speaker :* The question is:
"That Clause 1 stand part of the Bill."
The motion was adopted.
Clause 1 was added to the Bill.

## *PREAMBLE*

*Mr. Speaker :* The question is.
"That the preamble stand part of the Bill."
The motion was adopted.
The preamble was added to the Bill.

*Dr. B. Gopala Reddi* : I beg to move :

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be passed into law."

*Mr. Speaker* : Motion moved.

(Pause)

*Mr. Speaker* : The question is

"That the Madras Sales of Motor Spirit Taxation (Andhra Pradesh Extension and Amendment) Bill, 1958, be passed into law."

The motion was adopted

**The Andhra Pradesh General Sales Tax (Amendment) Bill, 1958.**

*Dr. B. Gopala Reddi* . I beg to introduce the Andhra Pradesh General Sales Tax (Amendment) Bill, 1958 and move that the Bill be taken into consideration at once.

*Mr. Speaker* : Motion moved

డాక్టర్ బి. గోపాల రెడ్డి:—అధ్యక్షా, దీంట్లో పన్నులు హెచ్చింపు అంతగా లేదు. రెండు రకాలుగా యీ బిల్లును తీసుకు రావలసిన అవసరం కల్గినది. ఇటీవల ఇండియా గవర్నమెంటు వారు అన్ని రాష్ట్ర ప్రభుత్వాల అనుమతితో Sugar, Tobacco, Textiles —ఈ మూడింటి మీద additional excise duty వేసి, ఇక మీదట వీటి మీద Sales Tax విధించకూడదు అని ఒక నిర్ణయానికి వచ్చారు. దీని ప్రకారం అది అమలులోనికి వచ్చింది. Finance Commission వారుకూడ సిఫార్సు చేశారు. అందువలన యీ మూడు వస్తువుల మీద Sales tax వుండదు. ఈ విషయాన్ని మన చట్టం లో సవరించవలసిన అవసరం ఏర్పడినది.

[*Sri S. Ranganatha Modaliar in the chair*]

ఇటీవల Finance Ministers Conference జరిగినప్పుడు "luxury articles' మీద అన్ని రాష్ట్రాలలోను uniform tax ఉండడం మంచిది, ఒక రాష్ట్రంలో ఎక్కువగాను, ఇంకొక రాష్ట్రంలో తక్కువగాను ఉండడంవల్ల యీ trade కొంత dislocate అవుతుంది, అనే సూచన ఇండియా గవర్నమెంటు వారు చేసినారు. U.P , Delhi, Punjab ఈ మూడు దగ్గర దగ్గరగా ఉన్నాయి. Uniform tax లేక పోతే డిల్లీలో, పంజాబులో, యు. పి. లో యీ వ్యాపారానికి కొంత యిబ్బంది కల్గుతుందనే భావంతో 15 వస్తువుల మీద uniform tax వేయడానికి కేంద్రప్రభుత్వం వారి సూచనతో అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు అంగీకరించాయి. కేరళ ప్రభుత్వం నుంచి కాశ్మీరు ప్రభుత్వం వరకు అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు యీ 15 వస్తువుల మీద uniform tax వుండ వచ్చునని ఒప్పుకున్నాయి. Uniformity అంటే—బొంబాయిలో 10% ఉన్నది. అన్ని చోట్ల 10% చేస్తే అది ఎక్కువగా ఉంటుందనే ఉద్దేశంతో అనేక రాష్ట్రాల అభ్యర్థన మీద 7% uniform tax అనే దానిని అన్ని రాష్ట్రాలవారు అంగీకరించారు. ఆ 15 వస్తువులు ఏవో సభ వారికి తెలియు

చేయడం అవసరం ఇప్పుడు మనకుకొన్ని వస్తువులమీద 5% ఉన్నది. General Sales Tax Actలో 2% ఉన్నది. కొన్ని కొన్ని వస్తువుల మీద యిప్పటికి 7% విధించబడుతోంది. కొన్ని వస్తువుల మీద 5%, కొన్నింటి మీద 3% కూడా ఉన్నది వీటన్నింటి మీద uniform గా 7% ఉంటే మంచిదనే భావంతో అన్ని రాష్ట్రాలవారు ఒప్పుకున్నారు. వారంతాకూడా త్వరలోనే ఆవిధంగా amendment తీసుకు వస్తామని కేంద్ర ప్రభుత్వానికి వాగ్దానం చేశారు.

1 Motor vehicles including chassis of motor vehicles, etc.
2 Motor cycles and cycle combinations.
3 Refrigerators, air conditioning plants and component parts thereof.
4. Wireless reception instruments and apparatus, radios and radio gramaphones, etc.
5 Cinematographic equipment including cameras, projectors and sound recording and reproducing equopment, etc.
6 Photographic and other cameras and enlargers, lenses, films and plates, paper and cloth and other parts and accessories required for use therewith.
7. All clocks, time-pieces and watches and parts thereof.
8. Iron and steel safes and almirahs.
9. All arms including rifles, revolvers and pistols and ammunition for the same.
10. Cigarette cases and lighters.
11. Dictaphone and other similar apparatus for recording sound and spare parts thereof.
12. Sound transmitting equipment including telephones and loudspeakers and spare parts thereof.
13. Typewriters, tabulating machines, calculating machines and duplicating machines and parts thereof
14. Binoculars, telescopes and opera glasses
15. Gramaphones and component parts thereof and records.

ఇవి luxury articles అనే భావంతో ఇక ముందు వీటన్నింటి మీద అన్ని రాష్ట్రాలలోనూ 7% ఉండాలని నిర్ణయించారు. కాని, బొంబాయిలో 7% కంటే ఎక్కువేఉన్నది. వారు అట్లానే ఉంచుకుంటామన్నారు. వారిని కూడా 7% కు తగ్గించుకోమని మేమంతా కోరినాము. "అట్లా తగ్గిస్తేమాకు చాలానష్టం వస్తుందికాబట్టి 7% కంటే ఎక్కువనే ఉంచుకుంటాము" అన్నారు. కాబట్టి అది అట్లాగే ఉంటుంది. ఈ 15 వస్తువుల మీద 7% వేయడానికి అన్ని రాష్ట్రాలవారు అంగీకరించారు. వారందరూ కూడా యిటువంటి సవరణలు తీసుకు వస్తారు ఈపైన చెప్పిన కారణంవల్ల యీ amending Bil తీసుకు రావలసిన అవసరం ఏర్పడింది.

Cotton, yarn ను కూడా declared goods క్రింద Government of India వారు ప్రకటించారు. అందు వల్ల యీ cotton yarn కూడా IV Schedule లో రాబోతున్నది. Cotton yarn waste మాత్రం ఇప్పుడున్నట్లుగానే ఉంటుంది.

The list of declared goods includes also coconuts and cotton seeds

దాని ప్రకారం coconuts, oil seeds కూడా declared goods క్రింద IV Schedule లో include చేయడానికి amendment సూచిస్తున్నది.

ఇంకా కొంచెంవివాదగ్రస్థమైన విషయంబంగారముగురించినది. ఇప్పుడున్నటువంటి Act లో Bullion మీదగాని, Jewellery మీదగాని 1/4% ఉన్నది. వెండిపాత్రలు, బిందెలు, సాసర్సు యివన్నీ Jewellery కాదు అనే వుద్దేశ్యంతో 2% వేయాలి అనిమాలఆఫీసర్సు యీమధ్య assess చేస్తున్నారు దానిమీద మాకుకొన్ని representations వచ్చినాయి. Bullion Jewellery మీద 1/4% మాత్రమే ఉన్నవి. అంటే 100 రూపాయలు వస్తువు వుంటే 0—4—0 మాత్రమే వేస్తారు. వెండిపాత్రలు మొదలైన వాటి మీద 2% వసూలుచేస్తున్నారు. కాబట్టి యీ ఒకేదుకాణంలో యీరెండు accounts వుంటాయి, ఇదికష్టంగావుంటుందని కొన్ని representations వచ్చినాయి అందువల యీరెండింటికి compromise గా బంగారంగాని, Jewellary గాని, పాత్రలుగాని ఏవైనప్పటికీకూడా రూ. 0—4—0 ఉన్నదానిని రూ 0—8—0 చేసు న్నాము. దానికింకొకకారణంకూడావున్నది. ఈమధ్య కేరళ ప్రభుత్వము మద్రాసుప్రభుత్వము కూడ యీ Bullion మీద 1/2% చేస్తున్నాము, మీరుకూడ చేస్తే బాగుంటుంది, అని మద్రాసు పభుత్వంమాకువ్రాసింది. కేరళ, మద్రాసులుచేస్తున్నాయికనుక మనంకూడ యీ 1/2% కు అంగీకరించితే trade కు అంత నష్టం ఉండదనే భావంతో వ్రాసినారు. ఇప్పుడు బులియన్‌మీద జ్యూయలరీమీద, వాటితో చేయబడిన వస్తువులమీద కొన్నింటిమీద 1/4% 1/2% యీవిధంగా ఉన్నది. అదంతా compromise చేసి 1/2% చేయాలని సూచించబడినది.
- కొన్నింటిమీదకిరోసిన్‌విషయంలోకాల్టెక్సు కంపెనీవారుకొత్తరూలులోవున్నప్పుడు ఇండియాగవర్నమెంటు వారుకొన్నిassurances ఇచ్చారు దానిప్రకారం tax point వారిమీద కాకుండా next purchaser మీద పెట్టినారు. కిరోసిన్‌మీద 2% tax ఉన్నది. అదివసూలు చేస్తున్నారు. ఈ amending legislation లో point మాత్రమే మారుస్తున్నాము. ఇవి దీనిలోని ముఖ్యమైన విషయాలు.

ఆశ్టే వివాద గ్రస్థమైన అంశాలేమీ లేవు. Cocoanut మీద యిప్పుడున్న చట్టం ప్రకారం 3% ఉన్నది. త్వరలోనే Central అమలులోనికి రాబోతున్నది. అది వచ్చిన తరువాత cocoanut మీద 2% కంటె తగ్గుతుంది ఒక్క బంగారం విషయమే కొంచెం వివాద గ్రస్తమైనది. 1/4% నుంచి 1/2% చేయడం కొంచెం వివాద గ్రస్థంకావచ్చును. మిగిలిన వన్ని అన్ని ప్రభుత్వాలుఅంగీకరించిన విషయాలే. ఈ నాడు Sugar, Tobacco, Textiles — ఈ మూడు General Sales Tax Act లో యిక ముందు ఉండవు — — ఈ విషయం కొత్త చట్టంలో పెట్టుకోవాలి కనుక యీ సవరణ చట్టం అవసరమైనది. ఇందులో ఏమీ వివాదగ్రస్థమైన విషయాలు లేవు కాబట్టి, కొత్తపన్నులకేమీ సూచనలు లేవు కాబట్టి దానిని అంగీకరించవలసినదిగా కోరుతున్నాను.

*Sri Vavilala Gopala Krishnayya:* I beg to move :
"That the Bill be referred to a Select Committee."

*Mr. Chairman :* Motion moved.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య.—అధ్యక్షా, శ్రీ గోపాలరెడ్డిగారు ఆర్థికమంత్రిగా వుండగా డబ్బు తగ్గించుకునే బిల్లు ఇదేనేమో ! వారిచ్చిన లెక్కల ప్రకారం చక్కెర, పొగాకు, textiles యీ మూడింటి మీద 3,05,00,000 రూపాయలు వస్తుందని అంచనా వేసుకున్నారు. 1956—57 సంవత్సరంలో వేసుకున్న లెక్కలప్రకారం 235 లక్షల రూపాయలుంది కాబట్టి దాదాపుఅదే యివ్వడానికి నిర్ణయించుకుంటున్నారు అందువల్ల మనకు వచ్చేది 235 లక్షల రూపాయలు మాత్రమే నేమోనని అనుమానంగావుంది అంతకన్నా ఎక్కువ వస్తుందని చెబితే సంతోషం

డాక్టర్ బి. గోపాల రెడ్డి:— మేము అందాజుగా 305 లక్షల రూపాయలు వస్తుందని అనుకున్నాం. ఫైనాన్సు కమీషను guarantee చేసినది 235 లక్షల రూపాయలు. 1956—57లో "మీకు ఎంత వచ్చింది అనే basis మీద వాళ్ళు తీసుకున్నారు. క్రొత్తగా తెలంగాణాలో చట్టం అమలులో పెట్టాము. 1957-58లో మాకు 305 లక్షల రూపాయలు రావచ్చును కాబట్టి 305 లక్షల రూపాయలుఇవ్వండని కోరినాము. Development Council లో Chief Minister లు 1956—57 సంవత్సరపు రాబడి basis గా వేసుకుంటున్నామని ఒప్పుకున్నారు. 1956—57 వ సంవత్సరములో 235 లక్షల రూపాయలు మాత్రమే వచ్చింది కాబట్టి దానిని మేము guarantee చేస్తాం అంతకంటే తక్కువ రాకుండా చూస్తాం. కాని మేము వేసే additional excise duty వల్లయింకా ఎక్కువగా వస్తుందని ఆశగావుంది. అందువల్ల యీ guaranteed మొత్తంకాక పంచదార పైన 6.65% ఆంధ్ర ప్రదేశ్‌కు యిస్తాం, పొగాకుపైన 10.47% వరకూ యిస్తాం; textiles పైన 7.38% వరకూ యిస్తాం", అని ఒక proportion ను ఫైనాన్సు కమీషనువారు తమ నివేదికలో నిర్ణయించారు. దాని ప్రకారంగా మనకు 61 లక్షల రూపాయలు యీసంవత్సరమే వస్తుందని అంచనా వేసుకుంటున్నాము. కాబట్టి 235 లక్షలకు 61 లక్షలు కలిపితే 296 లక్షల రూపాయలు రాబడి మనకువస్తుందని లెక్క. మేము ఆర్థికమంత్రుల సమావేశములో "విదేశాలనుంచి వచ్చే బట్టలపైన కొంత import duty వేస్తున్న దానిలోనిభాగం మాకు పంచిపెట్టవలెను" అని కోరినాము. దానివల అయిదు లక్షల రూపాయలు రావచ్చును అదికూడా యీ pool లోకి వస్తుంది. మేము అడిగిన 305 లక్షల రూపాయలు అందాజగావేసిన అంకెలే. తెలంగాణాలో ఒకచట్టం చేసినారు. పోయినసంవత్సరం 235 లక్షలు రూపాయలు వచ్చింది. ఈ సంవత్సరం 305లక్షల రూపాయలు వస్తుందని ఆశించినదేగాని ఎంత వస్తుందో భవిష్యత్తులోచూడాలి. ఏమయినప్పటికి యిది 13-12-1956 నుండి అమలులోకివచ్చింది. ఈ 3 వస్తువులమీద సేల్సు టాక్సులేదు. దానికి వారు compensation యిస్తున్నారు. దీనివల్ల వచ్చేది లాభమేనని ఉద్యోగస్థులు అనుకుంటున్నారు. నష్టం రాలేదు.

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య:—అధ్యక్షా, మనకు నష్టం రాలేదనే అంచనా గురించి సంతోషమే. మన ఆర్థిక విధానంలో యీ లోగా వచ్చిన ఫైనాన్సు కమీషను మనకు కొంత సౌకర్యము చేసినందుకు వారికి అభినందనలు చెప్పవలసినదే.

డాక్టర్ బి. గోపాల రెడ్డి:— అవన్నీ budget discussion కు reserve చేసుకుంటే మంచిదేమో !

శ్రీ వావిలాల గోపాల కృష్ణ య్య:— Reserve చేసుకోడమే కాకుండా మళ్లీ repeat చేస్తున్నాను. మనకు వచ్చే రాబడిని వారు వసూలు చేసుకునే ప్రయత్నం చేసినందువల్ల మన మీద encroach అవుతున్నారేమోనని అనుమానం వేస్తున్నది. దాని వల్ల మనం వేసే పన్నులలోనే చాలా మార్పులు వచ్చాయనుకుంటాను. "ఈ మార్పులు ఫలితంగా వచ్చే ఫలితాలు యేమిటి ? ఈ సందర్భంలో ప్రజలకు అందించవలసిన ప్రత్యేక వివరాలు యేమిటి ? ఫైనాన్సు కమీషనుకు మనం represent చేసిన దాంట్లో,వారు ఒప్పుకున్న దాంట్లో రాష్ట్ర అధికారాలు ఎంతవరకు నష్టపడకుండా వున్నాయి ?" అనేటటువంటి అంశాలు సమగ్రంగా ఆలోచించడానికి ఒకసెలెక్టు కమిటీనివేస్తే బాగుంటుందేమోనని నా ప్రార్థన. వివరాలు క్లాజు వారీ చర్చలో మాట్లాడలేదు. క్లాజువారీ చర్చలోనో లేక third reading లోనో మాట్లాడే అభిప్రాయంతో ప్రస్తుతంవున్న వివరాలుచర్చించకుండా యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపడం మంచిదని మాత్రమే కోరుతున్నాను.

శ్రీ పి. సత్యరాయణ (సామర్లకోట).—అధ్యక్షా, ఈ బిల్లు వల్ల అదాయ వ్యయాలలో పెద్ద మార్పులేమి రావనే ప్రారంభ వాక్యంలోనే సెలెక్టు కమిటీకి దీనిని సంపించ వలసిన అవసరంలేదనే వాదం ఎదుర్కోడానికి మంత్రిగారు ప్రయత్నించారు. కాని యిలాంటి ఆర్థిక బిల్లులు సవరిస్తున్నాం, ఏ శెడ్యూల్లోనైనా మార్పుచేయడం వల్ల, రేట్లు మార్చడంవల్ల, వస్తువులు మార్చడంవల్ల షెడ్యూలులో నంబర్లు మార్చడం వల్ల ఏ విధంగా పన్నురేటు affect అవుతుంది? అనే విషయాలు టేబిలుమీద పెట్టడం చాలా అవసరం. అది లేకుంటే సరిగా అవగాహనకాదు. ఈ Statement యివ్వడంతో మరొక అవసరంకూడా వుంది. అందులోని వస్తువులలో luxuries కొన్ని వున్నాయి. మధ్య తరగతివారు వుపయోగించే వస్తువులు కొన్ని వున్నాయి ప్రజా సామాన్యానికి ప్రాథమిక అవసరాలైన వస్తువులు కొన్ని వున్నాయి. వీటి మీద ఎంత డబ్బు వినియోగం అవుతుందో అంచనా మనకు లేక పోతే యీ రెండవ ప్రణాళికకు ఖర్చులయే డబ్బును యే విధముగా క్రమబద్ధం చేయాలి అనేది అవగాహన కాదు. షెడ్యూలులో 1లో luxuries వుంటే, ఆ షెడ్యూలు క్రింద యీ సంవత్సరం ఏ మాత్రం వచ్చింది ? ఇప్పుడు ఈ మార్పువల్ల ఏ మాత్రం వస్తుందనే విషయం కొంచెం యింకా లోతుకు పోయి అవగాహన చేసుకోడానికి అవకాశం వుంటుంది. ఆ విధమైన statement తయారు చేసి సెలెక్టు కమిటీలో వివరంగా చర్చించడానికి అవకాశం యివ్వ మని నేను కోరుతున్నాను. ఈ సందర్భంలో మరొక్క విషయం వున్నది. బొంబాయిలో 10% వినోద వస్తువుల మీద పన్ను వుంటే, మిగతా అన్ని రాష్ట్రాలలోమాదిరిగా 7% కి తగ్గించి వున్నామని చెబుతున్నారు. కొన్ని చోట్ల 5% వుంటే, కొన్ని చోట్ల 2% పెరిగిందనుకోండి. దీనినంతటికీ ఒక విషయం మాత్రం ఆర్థిక మంత్రిగారి దృష్టికి తీసుకు వస్తున్నాను. సోషలిజమంటే యేమీ ప్రమేయం లేని ఇంగ్లాండు లాంటి దేశంలో Motor cars పై 100% సేల్సు టాక్సు వున్నది. అక్కడ Motor cars తయారు చేస్తున్న మాట వాస్తవమే. కాని మన దేశంలో కూడా కొంత వరకు Motor cars ను తయారు చేస్తున్నాం. చాలా భాగ్యవంతమైన ఆ దేశంలోనే వినోద వస్తువుల వాడకాన్ని కొంత వరకు నిరుత్సాహపరచి యితరదేశ అవసరాలకు మళ్ళించే ధోరణిలో అక్కడ ఆర్థిక వ్యవస్థ నడుస్తూవుంటే నేడిక్కడ Motor cars పై 7% మాత్రమే వేసి సంతృప్తి పడుతున్నారు.

డాక్టర్ బి. గోపాల రెడ్డి.—ఇంగ్లండునుంచో అమెరికానుంచో Motor cars వచ్చినప్పుడు వాటిమీద 60% వరకు భారత ప్రభుత్వంవారు import duty వేస్తున్నారేమోనాకు తెలియదు. కాని ఇది ప్రత్యేకంగా Sales Tax కు సంబంధించిన విషయం.

శ్రీ పి. సత్యనారాయణ:— Import duty వున్నప్పటికీ ఈ రోజు హైదరాబాదు సికింద్రాబాద్ జంట నగరాలలో ఎన్ని కుటుంబాలకు మోటారు కార్లు వున్నవనే విషయం మనము ఆలోచించవలసియుంది వ్యవసాయక దేశములన్నీ పారిశ్రామిక దేశములుగా కావాలని ఎంత ఆతురతతో తమ పెట్టుబడులను క్రమ బద్ధము చేయుటకు ప్రయత్నించుచున్నవో అలాంటి దేశాలలో మోటారు కార్లను వినోదం కొరకు ఉపయోగించే పాలసీని అనుసరిస్తున్నారు. పొదుపు ఉద్యమం గురించి మనము ఎన్నో ఉపన్యాసములు ఇస్తూ వున్నాము. అలా ఉపన్యాసములు ఇవ్వటానికి పెద్ద పెద్ద జీతాలను ఇచ్చి ఉద్యోగులను నియమిస్తున్నాము పొదుపు ఉద్యమం మధ్య తరగతి ప్రజలకు, పేదలకు మాత్రమే అవసరమైనది కాదు అనవసరముగా కార్లపై డబ్బును ఖర్చు చేసే వారిపై కూడా అది విధిగా వుంచవలసిన అవసరం వుంది. మన చేతిలో ఉన్న ఈ ఆయుధమును వారిపై కూడా ప్రయోగించి వారు ఆ విధముగా ఖర్చు చేసే పద్ధతిని అరి కట్టటానికి మనం గట్టిగా ప్రయత్నం చేయాలి. ఈ మధ్య భారత ప్రభుత్వమువారి నాల్గు డెలిగేషన్స్ చైనా వెళ్ళినవి. కల్చరల్ డెలిగేషన్, ఎగ్రి కల్చరల్ ప్లానింగు, ఎగ్రికల్చరల్ కోపరేటివ్ డెలిగేషన్, ప్లానింగ్ డెలిగేషన్ చైనా వెళ్లి తిరిగి వచ్చిన పిదప వారు ఒక రిపోర్టునుతయారు చేశారు. దానిలోవారు "స్టేట్‌లెవెల్‌కు సంబంధించినంతవరకు, పెద్ద పెద్ద industres లోను, పెద్ద instituations లోను, మాత్రమే మోటారు కార్లను ఉపయోగిస్తారని, మిగితా వాటిలో కూడా మోటారు కార్లపై డబ్బును చైనా వెచ్చించటం లేదని" చెప్పారు. భారత ప్రభుత్వమువారు దానిని ఎప్రీషియేట్ చేస్తూ ఆ పాయింటును హెచ్చరించారు. ఆ విషయమును మనము మర్చి పోకూడదు. ఒక వైపు దేశంలో ముఖ్యమైన పెట్టు బడులకు వనరులు లేక మనము చాలా భాద పడుతున్నాము. మరోవైపు కేవలం వినోదం కొరకే ఒక వ్యక్తికి, ఒక కుటుంబమునకు సంబంధించినంత వరకు డబ్బు ఖర్చు అవుతున్నది. ఆ డబ్బు ఆ విధముగా ఖర్చు కాకుండా మనము ప్రయత్నించాలి. కేంద్ర ప్రభుత్వముపై కూడా వత్తిడిని తెచ్చి దీనిని 50 నయాపైసలకు పెంచాలని కోరుతున్నాను. ఇప్పుడు కేంద్ర ప్రభుత్వము సేల్స్ టాక్సు రంగములో కూడా శాసన రీత్య ప్రవేశించినది. ఆదిలోకాన్స్టిట్యూషన్ లో లేక పోయినా, తరువాతవారు ప్రవేశించారు. అలా ప్రవేశించిన పిదప కొంతవరకు టాక్సు ఇవేషన్‌ను అరికట్టటానికి కొన్ని చర్యలు తీసుకోవటం , ఇంటర్ స్టేట్ ట్రాన్సేక్షన్ లో వుండి కొన్ని బాధలను కొద్దిగా తగ్గించడం జరిగినవి తప్పితే స్టేటుకు సంబంధించినంతవరకు మిగతా విషయములలో మనకు నష్టమే కలుగు చున్నది.

ఉదాహరణకు ఆంధ్ర రాష్ట్రములో కోల్, మైకా, మాంగనీసు, ఐరన్ ఒర్ విపరీతంగా దొరుకును. వాటిపై 1%,5% సేల్స్‌టాక్సు పెంచినా వ్యాపారములో పెద్దమార్పు కనిపించదు. అవి బ్రహ్మాండమైన లాభములు సంపాదించి పెడుతూ, పరిశ్రమలకు ముడిపదార్థములుగా వెడుతున్నాయి. దాని పై మనకు వున్న అధికారములు పోయి, మన చేతులకు సంకెళ్ళు పడినవి. జీవితావసరాలకు ముఖ్యమైన వాటిపై 8% వరకు మనము పన్ను వేశాము. ప్రతి పూట నోటిలో ముద్ద పెట్టుకొనే సమయంలో ప్రతి వ్యక్తి బాధ పడుతూనే వుంటాడు. మైకా, మాంగనీసు మొదలైన వాటి వ్యాపారం లో మనకు ఏ విధమైన స్వేచ్ఛ లేకుండా చేయబడింది. అది మన స్టేటు యొక్క అభివృద్ధికి ఆటంకముగా వున్నది. అంతర్జాతీయ వాణిజ్య వ్యవహారములలోను, అంత రాష్ట్రీయ వ్యవహారములలోన్న కేంద్రము ఇంటర్‌ఫియర్ కాకూడదని మనము కోరటం ఎడ్మినిస్ట్రేటివ్‌గా వాంచనీయముకాదు. కాని దీని మీద వేసే పన్ను చాలదని అవి ఇండస్ట్రియల్ గూడ్స్ కనుక యింకా పన్ను పెంచాలనే మనము కోరు తున్నాము. ఈ సంవత్సరం సేల్సు టాక్సును వసూలు చేసే టప్పుడు వచ్చిన చిక్కులను మనసులో పెట్టు

కొని ఆర్థిక మంత్రిగారు ఈ బిల్లును తెచ్చివుంటే చాలా బాగుండేది. కానివారు దానిపై ఎక్కువదృష్టిని నిలువలేదు. బంగారము, వెండి తప్పితే మిగిలా వాటిపై వారు శ్రద్ధ వహించలేదు. మిగిలా వాటిలోవుండే ఈతి బాధలను అన్ని పార్టీలవారు వివరంగా చెప్పారు. మెమొరాండములు ఇచ్చారు. కాని వారు తీసుకు వచ్చిన సవరణవల్ల వారు దానిని పట్టించుకొన్నట్లు కన్పించటములేదు. ఉదాహరణకు 10 వేలు మినిమమ్ టరన్ ఓవర్ వున్నవారి నందరిని Ring లోనికి తీసుకు రావటం, వారిపై పన్ను వేయటం జరిగింది.

దీనిని 20 వేల వరకు పెంచమని మేము గట్టిగా పట్టు పట్టాము. బొంబాయిలోను అదే విధముగా వుంది. మద్రాసు స్టేటులో డాక్టర్ లోకనాథన్ గారితో ఒక స్పెషల్ కమిటీని వేయించి, వారి చేత ఒక రిపోర్టును తయారు చేయించారు. వారు దీనిలోని బాధలను గుర్తించి 25 వేల లోపు వుండే వారికి వేరే ఎరేంజిమెంట్స్ చేయాలని సిఫార్సుచేశారు. మనిషికి రోజుకు 2—8—0,3—0—0 కంటే మించి net ఆదాయంవుండదు. అది కుటుంబానికి సరిపోయే ఆదాయం కాదు. వారిలో కొందరికి సంతకాలు చేయటంకూడా రాదు. Accounts వ్రాయటంరాదు. అలాంటివారు, సేల్సు టాక్సు లెక్కల విషయంలో 16,20 ఫారమ్స్ పూర్తిచేయటంలో నానా అవస్థలు పడుతున్నారు. అబద్ధాలు ఆడుతున్నారు. పారి పోతున్నారు. ఒకసారి ద్వారపూడి సంతకు సేల్సుటాక్సు ఆఫీసర్ వచ్చాడని తెలియగానే అన్ని సరకులు అక్కడే వదలి, కొందరు పారిపోవటం జరిగింది. వారికి డబ్బు ఇవ్వటం కష్టమే అయినా, అంతకంటే Accounts maintain చేయటం వారికి పెద్ద కష్టముగా. వుంది. అందుచేత "నువ్వు పర్ఛేజు చేసిన bills ను జాగ్రత్తగా వుంచు." అని మనం వారికి చెప్పే పరిస్థితి మాత్రమే ఈ నాడు అవసరమై వున్నది దానికి మంత్రిగారు అంగీకరిస్తే సంతోషమే. దానికి మేము ఒక సవరణ ఇచ్చాము. అలా అంగీకరించని పక్షములో Slab-rate గా నెలకు 10—15 చొప్పున ఇవ్వగలము అని ఎగ్రిమెంటుకు రావలసి వుంది. ప్రభుత్వమునకు పరిపాలనావ్యయం తగ్గుతుంది. ప్రజల బాధ తగ్గుతుంది. అందుచేతమంత్రిగారు దీనినిశ్రద్ధగాఆలోచించాలని కోరుతున్నాను. ఈ amendment ను ఇందులో చేర్చటానికి వీలులేకపోయింది. అందుచేత ఒకకొత్తక్లాజును చేర్చమని మేము amendment ఇచ్చాము. మరికొన్ని విషయములు కూడా ఆర్థిక మంత్రిగారి దృష్టికి తేవలసివుంది. వారు గ్రామములో పర్యటించి యున్నప్పుడు వారికి వ్యాపార సంఘముల వారు, మెమొరాండములు ఇవ్వటం, చెప్పటంకూడా జరిగింది. మంచివాడుగా వున్న ఉద్యోగస్తుని చెడ్డవానిగా మార్చి వేసే స్వభావము సేల్సు టాక్సు డిపార్టు మెంటులో వుంది. మహానుభావుడు, మహాత్ముడు అయితే తప్ప సామాన్యమైన మంచివాడు సామాన్య మైన పరిస్థితులలో చెడ్డవాడు కాలేడు. సామాన్యమైన మంచివాడు అసమాన పరిస్థితులలో దుర్మార్గుడు కాగలడు. అటువంటి డిపార్టుమెంటులలో మొదటిది ప్రొహిబిషన్. ఇప్పుడు సేల్సు టాక్సు డిపార్టుమెంటు కూడా వారి క్రిందకు వస్తున్నది. సేల్సుటాక్సు ఆఫీసర్కు 10—0—0 అవసరమైతే చిల్లర బజారుకు వెళ్లి సంపాదించుకొంటాడు. నేను ఈ విధంగా చెబుతున్నానంటే సేల్సు టాక్సు డిపార్టుమెంటులో వున్న వారందరిని దృష్టిలో పెట్టుకొని చెప్పటంలేదు. కాని అలాంటి వారుకూడా వున్నారు. మంచివాళ్లు లేరని నేను చెప్పడంలేదు. కాని వర్తక లోకానికి మాత్రం మన ఆంధ్ర దేశములో చాలా బాధగా ఉంది. చివరకు ప్రొహిబిషన్లాగా తయారు అయిపోయింది. ఉద్యోగి బెదిరిస్తాడు. ఏదో క్లాజు ప్రకారం చర్య తీసు కుంటానంటాడు. ఆ సెక్షన్ వివరాలు మీకు తరువాత మనవి చేస్తాను. నాల్గు సంవత్సరాల క్రితము assesment settle అయిపోయిన వ్యవహారాలలో కూడా, ప్రభుత్వం తనకు తానై కలుగ జేసుకొని accounts తెప్పించి పునర్విచారణ చేయించి, ఒక వేళ ఆ లెక్కలు లేకపోతే బుద్ధికి

తోచిన విధముగా ఎన్ని నిర్ణయించి, పెనాలిటీ కట్టి లతని నెత్తినబెట్టి వచ్చునని ఉంది నాలుగు సంవత్సరాల వరకు ఈ రకమైన లార్జి మార్జిన్ యిచ్చి పారేశారు. ఇది చాలా పబ్లిక్‌కు ప్రమాదకరమైన విషయము. వెనుక బడినటువంటి మన దేశంలో— ఆర్థికంగానే కాదు, నైతికంగాకూడా మనము వెనుక బడిఉన్నామని ఒప్పుకోక తప్పదు

*Mr. Speaker :* The question is whether the Bill has to be referred to Select Committee or not. You are going into general discussion.

*Dr. B. Gopala Red :* We are taking up the motion for general discussion also along with the reference to the Select Committee.

శ్రీ సి. సత్యనారాయణ:—ఎలాగ కావాలంటే అలాగ ఒప్పుకొనవచ్చును. ఈ బిల్లును సెలెక్టు కమిటీకి పంపవచ్చునని చెప్పవచ్చు. అందుచేత సర్టిఫికెట్ ఇవ్వడం evasion ఉన్నదని మనం ఒప్పుకోవాలి. కాని ప్రభుత్వానికి రాదగిన amount రాకపోవడానికి, రూపాయలో 16 అణాలూ, రాక పోవడానికి వర్తక లోకమేనా కారణం ? ఈ వర్తకులతో కుమ్మక్కు అయిన ఆఫీసర్సుకూడా కారణం అయి ఉన్నారు. ఈ ఆఫీసర్సు తమ దగాను కప్పుకోవడానికి కొన్ని అవకాశాలు యిందులో ఉన్నాయి. అవకాశం వచ్చింది కాబటి దీని విషయంలో కొన్ని సవరణలు చేసుకొంటే బాగుంటుంది. బాగా లోతుగా దీన్ని పరిశీలించడానికి రెండు, మూడు రోజులు టైము యిచ్చినట్లయితే సెలెక్టు కమిటీ వేయనవసరం లేదు. అందువల్లనే సెలెక్టు కమిటీని వేయమని కోరుతున్నాను. ఒకచిన్న ఉదాహరణ, చాలా ప్రమాదకరమైనది వంటి దిన్నీ,అసహ్యకరమైనటువంటిదిన్నీ, చెబుతాను. ఒకానొక వర్తకుడుతన ఎసెస్‌మెంటు లెక్కలన్నీ సెటిల్ చేసుకొని, పద్దు చెల్లించి, చలానా తీసుకొన్నాడు. అతను అక్కడనుంచి ఎక్కడికో పోయినాడు. ఆ కుటుంబంలో ఒకరిద్దరు చనిపోయారు. తరువాత ఎవరో యింకొకరు (ఆయనకు (బి) అని పేరు పెడదాం !) కొన్ని సంవత్సరములు పోయిన తరువాత ('ఏ') వద్ద 125/- రూపాయలు సరుకు తీసు కొన్నట్టుగా ఒక అక్కౌంటు చూపెట్టాడు. అలాగచూపిస్తే (ఏ) కు నోటీసు జారీచేశారు. నేను యివ్వడం ఆ ఫరవేం లేదు. అంతలో యిద్దరు చనిపోయారుకూడ ! నిజంగా వాళ్లమీద ఈ భారం పడింది. వాళ్ళ ఎంత వాదించినా, పెనాలిటీ కట్టుకోవలసి వచ్చింది. దీనికి కారణం చూస్తే వాళ్లతండ్రి తరంలో తగాదాలు, దావాలు ఉన్నాయట. పగ తీర్చుకోడానికి యిట్లా చేసుకొన్నారు. ఇందువల్ల అనేక యిబ్బందులు ఉన్నాయి కనుక ధారాళమైన Powers యివ్వకూడదని మొదటి point. నాలుగు సంవత్సరాల వరకు గడువు యివ్వకూడదనేది రెండవ point. అయితే యీ ధారాళమైన powers ఎట్లా ఎసర్సైజు చేయాలి ? నాలుగేండ్ల బదులు ఎంత reasonable టైము యివ్వాలి. మొదలైనవన్ని యిప్పుడు తేల్చుకొనే కంటే , సెలెక్టు కమిటీలో సావకాశంగా తేల్చుకుంటే బాగుంటుంది. ఇక్కడ Burden of proof 'ఏ' పై యుంది. నేరం ఆఫీసరు మోపాడు. బిజినెస్ 'ఎ' అనే ఆసామీ దగ్గర జరిగింది. చివరికి అతను యజ్ఞ పశువు క్రింద తయారయ్యాడు. ఇది మన Act లో ఉండే లోపము. ఇలాంటి సవరణలను చేయవలసి ఉంటుందని మనవి చేస్తున్నాను. ఇంకొకటి ముఖ్యంగా మన దేశంలో నైతిక వాతావరణము సన్నగిల్లి పోతోంది. రాను రాను ఒక్కొక్క సంవత్సరం గడచిన కొద్దీ యింకా సన్నగిల్లి పోతోంది. వర్తకులలో చాలా మందిలో నైతిక వాతావరణము సన్నగిల్లి పోయింది. ఈ శాసన సభలో అన్ని పార్టీలకు సంబంధించిన

వర్తకులు ఉన్నారు. నేను వ్యక్తిగతముగా మాత్రము చెప్పుచుంటేము. అమ్మకం పన్ను లేకుండా యితర రాష్ట్రాలకు ఎగుమతులు చేయుడం, అక్కౌంట్సు లేకుండా దిగాదేయుడం యిక్కడవుందరికీ తెలిసినదే! ఇక రాష్ట్రంలో వ్యవహారాలు చెప్ప నక్కరలేదు. మనము ఇఛ్ఛాపురం దగ్గర ఒక పెద్ద బలహీనత ఉంది. హిందూపూర్ దగ్గర ఒక బోర్డర్ ఉంది. బెలస్తూప్ బోర్డలు కూడా ప్రమాదంగానే ఉంది. అట్లాగే నెల్లూరు దగ్గరకూడా ఒక బోర్డరు ఉంది. ఎలాగా దాయు చూరు దగ్గర కూడా అట్లాంటిదే ఉంది. ఇఛ్ఛాపురంనుంచి, (ఒరిస్సాను మన దగ్గరనుంచి పోయినాను) కలకత్తాకు మన దగ్గరనుంచి డైరెక్టుగా అన్ని ఆహార పదార్థాలు లారీల మీద వెళుతుంటాయి. కాని యీ వర్తకులు మిల్లర్సు ఏమిచేస్తున్నారు? సరకు అంతా లామేకొంటారు. దానితో ఒకచోటు పేరుతో Book చేసి పారేస్తున్నారు. రైతు తాను పండించేటటువంటి పంట మీద Sales Tax కు ఎగ్జెంప్షన్ లేదు వర్తక రంగంలోకి, వర్తక వలయంలోకి ప్రవేశించిన తరువాతే Sales Tax కు ఎగ్జెంప్షన్ ఉంది. ఈ సంగతి వర్తకులకు యావన్మందికి తెలుసు. అందు వల్లనే ఈ విధముగా జరుగుతోంది. ఆర్థిక మంత్రిగారు ఏ నెల్లూరు జిల్లానుంచి వచ్చారో, ఆ నెల్లూరు జిల్లాలోనే కోట్లాది కోట్ల రూపాయల ఆహార పదార్థాలు ప్రభుత్వ పన్నులకు దొరకకుండా పోతోంది. అయితే ఈ విధంగా కేవలం వర్తకులు మాత్రమేనా చేస్తుంటారు? ఇందులో కొంత వరకు తెలిసి ఉన్నటు వంటి రైతులు కూడా ఉన్నారు. అనేక మంది భూస్వాములు 100 ఎకరాలు ఉన్న ఆసామీలు కూడా ఇలా చేస్తున్నారు. నెల్లూరులో అమ్మకపోతే 21—5—0 రూపాయలు వస్తుంది. మద్రాసు సిటీకి పోయినట్లయితే ఇరువది ఆరు రూపాయలు, పైగా లారీ ఛార్జీలు వస్తాయి. పెర్మిట్టుకు యిబ్బందిలేదు. సేల్సు టాక్సు లేదు. సరాసరి పంట కళ్లం లోనుంచి మదరాసు గోడౌను స్ట్రీటుకు తీసుకు పోవచ్చునని చెబుతారు.

ఆ విధముగానే తీసుకొని పోతున్నారు. ఇవన్ని చిన్న రైతులు గాని, మధ్య రకం వాళ్లుగాని చేయుటకు అవకాశం ఎంత మాత్రం ఉండదు. పెద్దవాళ్లు మాత్రమే చేస్తున్నారు. 'outside the border' కు సరుకు పంపినట్లయితే, ఈ ఆక్టుకు, జూరిస్‌డిక్షన్ ఉండేటట్లు ఒక సవరణను మనం తీసుకొని రావడం అవసరం. దీనికి సంబంధించిన సవరణ నోటీసుకూడా యిచ్చాను. అంతేకాదు. రైతు తను పండించుకొన్న పంటను, అమ్ముకొన్నట్లయితే పన్ను ఉండదని, యిది వరకు వ్యాసంయిచ్చి బిల్లులో ఒకరక్షణ యిచ్చాము ఇదికూడా వర్తకులకే పెద్ద రైతులకే లాభకరంగా ఉన్నది. ధాన్య రూపంలో out side the State కు వెళ్లినా ఏమీ Tax లేదు. అందుచేత, పండించినది పంట రూపంలో నైనా, లేక ఏ యితర ప్రాసెసింగ్‌లో అయినా, యితర రాష్ట్రాలకు పోయినట్లయితే, దానిమీద tax వేసే అధికారం ఉండడానికి వీలుగా, ఒక క్లాజును ఈ చట్టంలో యిమడ్చుట చాలా అవసరం. దీనికి సంబంధించిన ఎమెండుమెంటు కు నోటీసు యివ్వడం జరిగింది,

ఆంధ్ర రాష్ట్రంలో మనకు రూ. 400 కోట్ల వరకు national income వ్యవసాయం మీద వస్తోంది. ఆహార దినుసుల మీదైతేనేమి, వ్యాపారపంటల మీద అయితే ఏమి, యితర పంటల మీద నైతే ఏమి మొత్తమంతా కలిపి 400 కోట్ల రూపాయల ఆదాయం వస్తోందన్న మాట. ఈ వేళ పెద్ద మార్పు లేమీ లేవని, financial statement ఏమి ఇవ్వనక్కర లేదనిమంత్రిగారు చెబుతున్నారు. కానీ రేపు రాబోయే బడ్జెట్‌లో మనకు వ్యవసాయంమీద రూ. 400 కోట్ల ఆదాయం రావచ్చని చెప్పతున్నారన్న మాట . ఉత్పత్తి దారుడుతాను తినేతిండి, తన కుటుంబం తినే తిండి, తాను విత్తనాల కోసం నిలవ వుంచు కొన్నది పాలేళ్ల కోసంఅంతాకలిపితే రూ. 100—150 కోట్లకుఎక్కువఉండదు. మిగతా రూ. 250 కోట్ల

మేరకుమార్కెట్‌లోకి వస్తున్నాదా? ఈనాడు అంచనా ప్రకారం రూ. 6 కోట్ల ఆదాయంపోతోందనిన్నీ, యిది వారు గమనించడంలేదనిన్నీ, లక్ష్యం చేయడం లేదనిన్నీ నేను చెబుతున్నాను వారెందుకు financial statment తయారు చెయ్యలేదు. ఈతిబాధలున్నాయి దీనికంతా మనమేమి చేద్దామని Houseను Consult చేయాలి. ఈలాంటివి మనం కాస్త లోతుకు వెళ్ళితేకాని రెండవ పంచవర్ష ప్రణాళికను అమలు జరుపుకోవడం కష్టం. బహుశా యీ కష్టాలన్నీ పడడమెందుకని ఈ రెండవ పంచవర్ష ప్రణాళికను కత్తిరిస్తే తీరిపోతుందని అనుకుంటున్నారేమో కొందరు. ఆ వైఖరి ఎంత మాత్రం మంచిది కాదని నేను మనవి చేస్తున్నాను. అయితే 1954—55 కంటే 1955—56 లోను, 1955—56 కంటే 1956—57 లోను, 1956—57 కంటే 1957—58 లోను వ్యవసాయలెఖ్ఖల ప్రకారం Production పెరుగుతోంది. Production పెరగడంవల్ల మనకు Tax ఏమీ పెరగ లేదు. Quantity పెరగాలి Quantity మాత్రమే కాదు Rate of tax పెంచాము. అందుచేత వచ్చే tax చాలా పెరగాలి. కాని proportonate గా మనకు రావడం లేదు. అందువల దీనిని select committee కి పంపించాలి. 4—5 రోజులు పైమైనా సరే పోయింది ఏమీ లేదు. ఈలాంటి వ్యవహారాలన్నిటిలోకి మనం వెళ్ళి ఎక్కడెక్కడ loop holes వున్నాయి, ఎక్కడ screw బిగించవలెను, ఏమి చేయవలెను అనేటటువంటివి, పరిశీలించాలి. అనుభవజ్ఞులైన జాలయ్య్ గారు పై విషయాల గురించి చెప్పడానికి వున్నారు. ఆర్థిక మంత్రి గారికి దేశానికి సంబంధించిన ఆర్థిక విషయాలలో అనుభవం వుండవచ్చును. వ్యాపార రంగంలో వుండేవారి యొక్క అనుభవం వారు ఎలాగా తీసుకోవాలి? కేవలం officers యొక్క అనుభవన్నే వేద వాక్కు గానూ, final word గాను వారు తీసుకొంటే మనం దెబ్బ తింటాం. State దెబ్బ తింటోంది అందువల్ల కొంత time తీసుకొని, schedules లో కొన్ని మార్పులు చెయ్యమని నేను మనవి చేస్తున్నాను. ధాన్యం, బియ్యం, Millets, pulses యీలాంటి వాటన్నిటి మీద రాష్ట్రంలో వినియోగానికి పన్ను లేకుండా చెయ్యమని మేము కోరుతున్నాం. మేమే కాదు Central Government కూడ మనలను కోరుతోంది. భారత దేశంలో దాదాపు సగం రాష్ట్రాలలో తమకు తామైతే నేమి కేంద్ర ప్రభుత్వ కోరిక మేరకైతే నేమి యీ పన్నును తీసి వేశారు కానీ మన రాష్ట్రంలో మాత్రమే యింకా ఎక్కువగా వుంది. అందు చేత అది తీసి వేయాలని మనం కోరుతున్నాము. కాకపోతే రాష్ట్రాంతర వ్యాపారంలో మాత్రం కొంత పన్ను మనం ఎలాగూ తీసుకోవచ్చు అట్లాగే Gold and Silver వ్యవహారం చూడాలి. ఇప్పుడు వారు చెప్పిన యీ 50 నయాపైసాలకు అన్ని రాష్ట్రాలు అంగీకరిస్తే సరే సరి. లేక పోతే యిక్కడనుంచి వ్యాపారం Madras కు వెళ్ళి తరలి పోకుండా కొంచెం జాగ్రత్త వహించి మనం కూడా 25 నయాపైసలే చేసికోవడమో, లేకపోతే "శ్రమ పడ్డం ఎందుకులే" అని, 35 N. P. దగ్గరే మనం fix చేసికోవడమో చేయవలసివుంటుందని నేను మనవి చేస్తున్నాను ఈ Sales Tax అనేదిమొట్టమొదట ఏదో ఖజానాకు నాలుగు డబ్బులు వస్తే చాలుననే భావంతో consider చేయబడింది. తరువాత పెద్ద, పెద్దపరిశ్రమలు పెట్టడం, ప్రాజక్టులు కట్టడం అనేవి వచ్చేటప్పటికి, లేక పోతే ఆర్థిక మాంద్యం వచ్చి ధరలు పడిపోవడం నిరుద్యోగం మొదలైనటువంటి, రాజకీయ సమస్యలు వచ్చి ప్రభుత్వం crisis లో పడ్డప్పుడు సహాయపడుతుందని అనుకొన్నారు బహుశా మన ఆర్థిక మంత్రిగారు ఈ concepion లో వున్నట్లుగా నాకు తోస్తోంది. కానీ యీ వేళ planned economy అంటూ వచ్చిన తరువాత, స్థాయికి వెళ్ళి పోయింది. ఈ Second Five Year Plan యొక్క Formulation కోసం తయారు చేసే నటువంటి working papers ను మనం తీసుకొని చదివినట్లయితే చాలా

dynamic attitude తీసుకొన్నారు. మొత్తం దేశంలో వున్నటువంటి పెట్టుబడులనుకూడా పరిశ్రమీకరణానికికాని, ప్రాజెక్టుల నిర్మాణానికిగాని సమీకరణ చేయడానికి Sales Tax అనే టట్టిది మంచి పటుతరమైన పని ముట్టుగా మనం వుపయోగించుకోవాలన్నారు. ఇప్పుడు Motor Cars కు రాష్ట్రంలో ప్రతి సంవత్సరం అనేక కోట్ల రూపాయల ధనం అనవసర దుర్వినియోగమై పోతోంది దానినంతా కూడా మనం Capital క్రింద వుపయోగించుకోవడానికి మనకు అవకాశంవుంది. కనుక ఆ మూడవ దృక్పథం కూడా తీసుకొని ఆర్థిక మంత్రిగారు luxuries మీద యింకా ఎక్కువపన్ను వెయ్యడానికి అవకాశం వుంటే మంచిది. కేంద్ర ప్రభుత్వాన్ని కూడా బాగా press చేసి మిగతా Schedules లో కూడా కొన్ని రకాలైన మార్పులు యిప్పుడు నేను సూచించినవి, యింకా మిత్రులు సూచించబోయేవి అన్నికూడాసానుభూతితో ఆలోచించాలని, తొందరపడవద్దని నేనుసూచిస్తున్నాను. పరిపాలనా విధానంలో వచ్చేటటువంటి మరికొన్ని చిక్కులనుకూడా వివావృష్టికితెస్తాను. ఇతరరాష్ట్రాలఆసామీలు మనరాష్ట్రానికివచ్చి వర్తకంచేస్తారు. అమ్మకమైనాచేస్తారు లేదా కొనడమైనా చేస్తారు. వారు తప్పించ కోవడానికి చాలాఅవకాశాలువుంటాయి. అందువల్లమనంకొన్ని Clauses సవరించినట్లయితే, యెవరైనా స్వయంగాగాని లేక తమ agents ద్వారాగా గాని వ్యాపారం చేసినట్లయితే casual dealar అనే licence తీసుకోవాలనేపద్ధతిని మనంతీసుకురావాలి ఈసర్తకరంగంలో వుండే loopholesను గురించి నాతరువాత మాట్లాడుమిత్రుడు — సర్తకరంగంలో అనుభవిజ్ఞులు తెలియచేస్తారని అనిస్తున్నాను బయటి రాష్ట్రాలనుంచి వచ్చి వర్తకంచేసే వారిపై పన్ను వసూలుచేసేపద్ధతిని ఏర్పాటుచెయ్యాలి. ఈ విషయంలోకొన్ని legal difficulties ఉండనే ఉంటాయి. నాకు ఆ గొడవలేమో బాగా తెలియదు. దీనిని select committee కి పంపవలసిన అవసరం ఎంతైనా వుంది ఈ తేనతీసుకువచ్చిన సవరణలుబహుశా ఒక చిన్నక్లాజునుగురించినది. ఒకసారుణమైనవిషయాన్ని గురించి ఆర్థికమంత్రిగారు ఈసవరణ తీసుకు వచ్చారేమోనని అనిపిస్తున్నది. ఈవిధంగానాలు officers సలహాయిచ్చి వుండవచ్చు. ఎవరో ఆఫీసరుసలహాయిస్తే అదిఎంతప్రమాదకరమైనదో విచారించనైనా విచారించకుండానే పొరపాటున తీసుకువచ్చారేమోనని నేనుఅనుకుంటున్నాను ఈబిల్లునుయిదివరకు pass చేసినవు డే మాసుందరయ్యగారు అడుగడుగునా, అంగుళం, అంగుళం నా పోట్లాడారు. ఈనాడుఈసవరణ ద్వారా రు. 25,000-లలోపు ఆదాయంకలవారినికూడా చట్టంలోచేరుస్తున్నారు. పన్ను ఏలాగైనావేస్తున్నపుడు కటిన శిక్షలనుంచైనామినహాయించాలి. పెద్దవాళ్ళకు పెద్దశిక్షలు వేయండి,చిన్నవాళ్ళనిబాధ మాత్రంవేయ వద్దు Account books గట్టిగా తనిఖీచేయండి. ఇదివరకటి Act ప్రకారం account books పూజామందిరంలోవున్నా, లేక వంటింటిలోవున్నా దానిలోపలకు తలుపులు బద్దలు కొట్టి బూటుకాళ్ళతో ప్రవేసించడానికి officers కు అధికారాలున్నాయి. ఆ అధికారాలు Accounts కు సంబంధించినంతవరకు మాత్రంవర్తిస్తాయి. సరకునుకూడా స్వాదీనంచేసుకోవ డానికి యీసవరణనుతెచ్చారు. ఇదేమైనా ఆచరణ సాధ్యమైనట్టి విషయమేనాఅని మనంఆలోచించాలి. సరుకులనుస్వాదీనంచేసుకొనేముందు అవిఅన్నీకూడాకొలవాలి. ఒకకిరాణాదుకాణం ముందుకు వెళ్ళితే పావు రంగూాళ్ళవలె నూటయేభైగూళ్ళు అక్కడవుంటాయి. వాటిలోఅల్లంమొదలు జీలకర్రవరకు అన్నిసరక లు వుంటాయి. ఒకవేళ Account Books స్వాధీనంచేసుకుంటేఅవి తేలేవరకు ఈసరుకును ...నంలో ఉంచుకోవాలి. అందుకోసం ఫలానా సరుకు ఇంత ఉందని రసీదు ఇవ్వవలసి ఉంటుంది. ఈవిధంగా ఆ 150 సరుకులను తూచి రసీదుయివ్వడంఅనేది ఏమైనా తేలేవిషయమా? అందుచేత

యిది వరకున్న శాసనంచాలని మనవిచేస్తున్నాను. ఈనేళ officers మాకుసలహాయివ్వవచ్చు. Evasion వున్నదని మంత్రిగారు మమ్మలనంటారు. ఈ loopholes అన్నీ కూడా వారు తయారుచేసిన Act లోపలేవున్నాయంటారు వాళ్ళు. కేవలం, Evasions వర్తకుల వల్లనేరావడంలేదు. వర్తకులు, officers కుమ్మక్కు అవడంవల్ల వస్తున్నాయి. ఈవిషయమై officers ను ఎదురుప్రశ్నవేయాలి. కుమ్మక్కు కాకపోతే వర్తకులవల్ల చాలాఆదాయం వస్తుంది. అందువల్ల ఈ officers ను బిగించడానికి ఏమి చెయ్యాలో ఆలోచించాలి. ఇంతవరకు ఒక్క Sales tax officer ను లంచగొండిగాపట్టుకొని గట్టిగా శిక్షించారాలంటే అలాంటి విషయం ఏ Department లోను యింతవరకు జరగలేదు. ఈ దండయాత్రంతా వర్తకలోకంమీదనేనా ? నేనువర్తకలోకానికి రూపాయకు పదహారణాల ప్రతినిధినని మాత్రం అనడంలేదు ఆఫీసర్లకు ప్రతినిధులుగా మంత్రులు ప్రవర్తించకూడదని నేను మనవి చేస్తున్నాను.

శ్రీ టి జాలయ్య (గుంటూరు):— అధ్యక్షా ! Sales Tax మీద శ్రీ సత్యనారాయణ గారు వర్తకుల కష్టాల న్నీ చాల విపులంగా, ఎక్కువ అనుభవం ఉన్నట్లుగా మాట్లాడారు వారికి వర్తక సంఘం ధన్యవాదాలు అర్పించవలసి ఉంటుంది. వారు చెప్పినవన్నీ గవర్న మెంటువారు శ్రద్ధతో ఆలోచించి, వర్తకులకు సహాయం చేయ్యదలచుకుంటే, Acts లో గాని Rules లో గాని, వారికి ఇబ్బంది లేకుండా చెయ్యాలని ముందుగానే ఆర్థిక మంత్రిగారిని కోరుతున్నాను. గవర్నమెంటువారు చేసిన Rules లో కొన్ని కొన్ని లోపాలు ఉన్నాయి ఇక్కడ మన మేదో pass చెయ్యడం, దానిని Administration కొరకై ఉద్యోగులకు పంపడం, దాని ప్రకారంగా నడచినప్పుడు officers కు, వర్తకులకు, కొన్ని కష్టాల కల్గడం, దానిమీద మనం amendments పెట్టుకోవడం, ఈ విధంగా 1939 నుంచి ఇంత వరకు ఎన్ని మార్పులు చేసేరో నాకు అర్థం కాకుండా ఉంది. ఈ విషయాలన్ని ఆర్థిక మంత్రిగారికికూడ తెలుసును.

సమగ్రంగా amendment ను సమకూర్చి ఒకటే పద్ధతి మీద ఒక Bill ను కొత్తగా రూపొందిస్తే బాగుంటుందని అనుకుంటాను. Administration లో కూడ లోపాలు జరుగవు. ఈ సూచనను ఆర్థిక మంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను చిన్న చిన్న వర్తకుల సహాయంకొరకు, Multi point Tax లేకుండ, Single point Tax గా మార్చినందులకు గోపాలరెడ్డిగారిని అభినందించవలసి వస్తుంది కాని ఇప్పుడు ఉండేటటువంటి పరిస్థితులలో కొన్నింటిలో చిన్న వర్తకులకు మేలు జరగడం లేదు. పది వేల రూపాయల సామాగ్రి అమ్మేవాడికి పన్ను లేదు. కాని, చిన్న వర్తకుడు ఏడు వేల రూపాయలు పెట్టి, బియ్యము, గోదుమలు, పంచదార, సిమెంటు, Single point Tax మీద కొని, నాలుగు వేల రూపాయలతో మిగతా వస్తువులుకొని, వ్యాపారం చేస్తే Administrative ల officer లు వచ్చి మొత్తం పదకొండు వేలకు లెక్క కట్టి, ఏడు వేలు తీసేసి మిగతా నాలుగు వేల మీద పన్ను వేస్తున్నారు అది ఎంత మాత్రం న్యాయంగా లేదు. వస్తువులు మినహాయింపు లేకుండా ఈ విధంగా పన్ను వేస్తున్నారు.

వంద రూపాయలు అమ్మే చిన్న వర్తకుడు , వంద అర్థణాలు, అనగా మూడు రూపాయలు లాభం పొంది అందులోనే కొట్టు అద్దె, గుమస్తా జీతం ఇచ్చుకుంటూ చాలా కష్టపడిపోతున్నాడు. పెద్ద వర్తకుడు కి చిక్కు లేదు. పుస్తకాలలో లెక్కలువ్రాసుకొని పన్నులు భరించుకుంటూ, కొంటాడు, ఏ కష్టాలు వచ్చినా

భరించుకుంటాడు. కావునఅటువంటి orders ఏమైనా ఉంటే, అవివెంటనే రద్దు చేసి, చిన్నవర్తకులకు మేలు చెయ్యాలని ఆర్థిక మంత్రిగారిని కోరుతున్నాను. శ్రీ సాంబ మూర్తిగారు ఇక్కడే ఉన్నారు. Administrative orders అన్నీ వారికి తెలుసు. వారు ఒప్పుకోకుండా, వారికి తెలియకుండా ఏదీ వెళ్ళదు ప్రత్యేకంగా చిన్న వర్తకులకు మేలు చెయ్యమని కోరుతున్నాను. Inter State Sales Tax ఒకటి వచ్చింది Centre వారే ఇక్కడ కొంటున్నారు. కొన్ని వర్తకుడికి అమ్ముతున్నారు. Dealer ఒక పర్సెంటు పన్ను కట్టాలి మళ్ళా dealer దగ్గర గవర్నమెంటు కొంటే మూడు పర్సెంటు ఇయ్యవలసి వస్తుంది తుదకు ఇదంతా అమ్మిన వాడి నెత్తిన పడుతుంది జరిగిపోయిన నాటి transactions మీద పన్ను కట్టమంటే ఏమీ బాగాలేదు.

కేంద్ర ప్రభుత్వంగాని, మిగతా రాష్ట్ర ప్రభుత్వాలుగాని మన రాష్ట్రానికి వచ్చి వ్యాపారం చేసినట్లైతే, dealer లాగానే వారుకూడ పన్ను కట్టాలని Act ను pass చేసినట్లైతే మనకు లాభం వస్తుంది. దీనిని కూడ ఆర్థిక మంత్రిగారు ఆలోచించాలని కోరుతున్నాను.

వ్యాంగనీస్ వగైరా ముడి సరుకుల మీదగూడ పన్ను ఎక్కువ చేయమని చెప్పినారు. అలాగే ప్రభుత్వం ఎక్కువ చేస్తుంది తప్పకుండ లాభము వస్తుంది. కానిక్రమేణా వ్యాపారమే దెబ్బతినిపోయే ప్రమాదం వస్తుంది. పన్ను ఎక్కువ చేయుటవలన యితరులు మన దగ్గర కొనకుండ నరాయి దేశాలనుండి కొనడం ప్రారంభిస్తారు. అందువల్ల వ్యాపారమే స్తంభించిపోయేప్రమాదమున్నది. ఉ...వల్ల exchange కూడ దెబ్బ తింటుంది. దిగుమతి అయ్యే సరుకుల మీద మరియు మన దేశంలోనే వినియోగించే వస్తువుల మీద పన్ను పెంచ వచ్చును. కాని యితర దేశాలకు ఎగుమతి అయ్యే సరుకు మీద పన్ను వేయ కూడదు. పొగాకు మీద పన్ను అధికం చేయుటవల్ల సరకు ఇతర దేశములకుపోక రైతులు క్రిందటి మూడు నాలుగు ఏండ్లు చాలా యిబ్బంది పడినారు పోతే నాలుగు సంవత్సరాల లెక్కల తనిఖీ విషయం గూడ సత్యనారాయణగారు చాలా విపులముగా చెప్పినారు ఈ విషయంలోకూడ ఆర్థిక మంత్రిగారు ఆలోచించి నాల్గు సంవత్సరముల లెక్క పద్ధతి కాకుండా రెండు సంవత్సరముల పద్ధతి పెట్టితే కొంతబాగుం టుందేమోనని నా ఉద్దేశ్యం.

మా సేల్సుటాక్సు ఆఫీసరుగారిని మద్రాసునుంచి ఇక్కడికి allot చేసినారు. ఆయన చాలా పెద్ద తెలివి గలవాడు. మహాప్రజ్ఞా శాలియన్ని వినికిడి. ఆ ప్రజ్ఞ అంతా వర్తకులను నాశనంచేయుటకు ఉపయోగ పడుచున్నదే తప్పమరెందుకూ ఉపయోగపడడంలేదు. గత నాల్గు సంవత్సరాలలో Capacity ప్రకారంలెక్క కట్టి మిల్లులనుంచికొన్నికోట్లు రూపాయలు వసూలుచేయాలని చూశారు. కనుక ఈవిధంగా పన్నులు విధిం చుతూపోతే డబ్బుచెల్లించేవారుండరు. ప్రభుత్వం తీసుకుండేదిలేదు. ఈ నాలుగుసంవత్సరము లెక్కలపద్ధతి వల్ల చిన్నవర్తకులు ఎలాకష్టపడుదురో ఆర్థికమంత్రిగారికి బాగాతెలుసును. వారులా నవ్వుతూ కూర్చుంటే ఇక వర్తకుల సంగతి ఏమి కావాలి ? వారికి దిక్కు ఎవరు? వారి కష్ట సుఖాలను చూడవలసిన వారు ఆర్థిక మంత్రిగారే . కనుక వారు సానుభూతితో పరిశీలిస్తారని నమ్ముచున్నాను. లాభం వచ్చినా, నష్టమే ప్రాప్తిం చినా వర్తకులు పన్నులు చెల్లిస్తూనే యున్నారు. కేంద్ర ప్రభుత్వం వారు ధాన్యం ధర, బియ్యం ధర నిర్ధారణ చేస్తూ ఒక మణుగుకు నాలుగు అణాలు లాభం ఇచ్చారు. అనగా నూటికి 1—8—0 లాభం ఇచ్చారు. కానికేంద్ర ప్రభుత్వం వారికి నూటికి పది రూపాయలు లాభం కట్టయినా కంట్రోళ్లు విధించి తీసికొంటున్నారు. ఇలాంటి పరిస్థితిలో రాష్ట్ర ప్రభుత్వమైనా వారిని ఆదుకొనడం కర్తవ్యము. కేంద్ర

ప్రభుత్వము నిర్ధారణ చేసిన ధరలు గూడా న్యాయంగా లేవు అందువల్ల భూస్వాములు దెబ్బ తింటారు. భూస్వాములు నష్ట పడితే వర్తకులు గూడా దెబ్బ తింటారు. అందువల్ల ప్రభుత్వానికి గూడా నష్టము వస్తుంది. కాబట్టి రాష్ట్ర ప్రభుత్వం అటువంటి సందర్భంలో వారిని ఆదుకోకపోతే ఆంధ్రప్రదేశ్‌లో శాంతి వుండదని నేను సవినయముగా మంత్రిగారికి మనవి చేస్తున్నాను Land reforms వచ్చినప్పటికి కళా వెంకటరావుగారు రెవిన్యూ మంత్రిగా ఉన్నందున ఏ రైతు భయపడ నక్కరలేదు. అలాగే ఆర్థిక మంత్రిగారు కూడా కనీసం చిన్న వర్తకుల మీద పెద్ద భారం వేయరని నమ్ముచున్నాను.

వెండి, బంగారము మీద నాలుగు అణాలనుండి ఎనిమిది అణాలకు పన్ను పెంచుతున్నారు. కాని ఈ సందర్భములో వర్తకులకు ఎలాంటి చిక్కులు లేకుండ చేస్తునందుకు వారి తరపున అభివందనలను తెలుపుచున్నాను. ఇక పోతే విలాస వస్తువుల మీద ఏడు నయాపైసలు పన్ను వేశారు. నేను ఈ మధ్య విదేశములకు వెళ్ళి వచ్చినాను. అక్కడ నేను ఒకగొడుగు బేరముచేస్తే 11 1/2 పౌనులు చెప్పినారు. నేను విమానము మీద తెచ్చి ఇవ్వమంటే $6^1/_4$ పౌనులు అని చెప్పినారు. అక్కడ సేల్సుటాక్సు చాలా ఎక్కువ. 130 రూ. ఖరీదుచేసే వస్తువుమీద 60 రూపాయలు సేల్సుటాక్సు ఉన్నది. నేను ఇంకొక వస్తువు కొన్నాను.అది 41 పౌనులు. విమానంమీద తీసుకువచ్చి దానిని 19 పౌనులకుఇచ్చారు. అనగా125% వరకుగూడ సేల్సుటాక్సుఉంది అన్న మాట. కానిఅక్కడవుండే ప్రజలకు సంపాదన ఎక్కువకాబట్టి వాటిని భరించ గలుగుతున్నారు. పన్ను పెంచినందువల్ల వర్తకులకు పెద్ద కష్టము లేదు. దేశము లోపలనే వాడుకొను వస్తువులకు పన్ను పెంచ వచ్చును. ప్రభుత్వం ఆర్జించుకోవచ్చును. కాబట్టి డబ్బు రావడమే ప్రధానంగా చూడక అందరి కష్ట సుఖాలను, గమనించమని కోరుతున్నాను. సత్యనారాయణగారు కూడా చాలా విపులంగా చెప్పినారు. వాటిలో యుక్తమని తోచినవి, ఇప్పుడు కాకపోతే తర్వాతనైనా వర్తకులకుమేలు కలుగనట్లుగా చేయమని కోరుతున్నాను. వడ్లమీద పన్నువేస్తున్నారు. దాని నుండి తయారయ్యే బై ప్రొడక్ట్సు తవుడు, నూక వగైరామీద పన్నులేదని చట్టంలో ఉన్నది. కానిపల్లెటూరి వర్తకులుతవుడుకొని తీసుకపోయి పశువుల మేత క్రింద అమ్ముకుంటూ ఉంటే దానికి మల్టిపాయింట్ పన్ను చెల్లించమని సేల్సుటాక్సు ఆఫీసర్లు వత్తిడి చేస్తున్నట్లు కనబడుచున్నది. ఇది చాలా అన్యాయం. ఆర్థికమంత్రిగారు తెనాలి వచ్చినప్పుడు చుట్టు ప్రక్కల నాలుగు జిల్లాలనుండి దాదాపు ఒక వంద మంది వచ్చి వారి కష్ట సుఖాలు చెప్పకొని అర్జీ గూడ ఇచ్చారనుకొంటాను. సేల్సు టాక్సు స్పెషల్ ఆఫీసరుగారైనా సాంబమూర్తిగారు కూడా ఇక్కడే ఉన్నారు. కనుక తవుడుకు పన్ను వసూలు చేయకూడదని ఒకఅడ్మినిస్ట్రేటివ్ ఆర్డర్ అందరికి జారీచేస్తారని ఆశిస్తున్నాను. Act లో తవుడు మీద పన్నులేదని D. C. O. గారు- చూపించారు. కాని అది మిల్లర్సుకు వర్తిస్తుంది. వారి దగ్గర బయటి వారు ఎవరైనా ఖరీదు చేస్తే వారు పన్ను చెల్లించవలసి వుంటుంది అని అన్నారు. అది న్యాయం కాదు ఒకసారి పన్ను దాని మీద చెల్లించడం జరిగింది. మరల రెండవ దఫా విధించడం సమంజసంగా లేదు. అది చిన్నచిన్న పల్లెటూరి వర్తకులుచేసే వ్యాపారం. దానిమీద సంవత్సరమునకు ఐదు, పది వేల కన్నా ఎక్కువ వ్యాపారం జరుగదు. అది పశు గ్రాసం. దాని మీదగూడ పన్ను వేస్తే రైతు భాద పడవలసి ఉంటుంది ఈ విషయంలో గూడా ఆలోచించమని కోరుతున్నాను. రేపు మా పార్టీ వారి అనుమతితో ఆహార పదార్థాల మీద చర్చ జరుపుటకు ఒక రోజు నేను కోరదలచుకున్నాను. వీటి మీద మిగతా విషయాలన్నీ దీర్ఘంగా ఆలోచించి ఆర్థిక మంత్రిగారు మేలు చేస్తారనే నమ్మకముతో నా అమెండ్‌మెంట్సును with draw చేసుకొనుచున్నాను.

శ్రీ కె. సీతయ్య గుప్త (ముషీరాబాద్):—అధ్యక్షా; నేను ఒక అమెండ్‌మెంటుఇచ్చాను. మంత్రిగారుకూడ అదివివాదగ్రస్త విషయమని ఒప్పకున్నారు. కనుకఆయనదానిని అంగీకరిస్తారని నమ్ముచున్నాను.

కాని జాలయ్యగారు ఆయనకున్న అనుభవం వరకే చెప్పినట్లు తెలుస్తున్నది ఆయన బంగారు, వెండి వర్తకుల కష్ట నిష్ఠూరములను గురించి ఏమీ చెప్పలేదనే నా భావం. సెలెక్టు కమిటీలో నాలుగు రోజులు చర్చ జరిగిన అనంతరం దానిని $1/2\%$ కు బదులు $1/4\%$ కు తగ్గించవలెనని అందరూ ఏక గ్రీవంగా అంగీకరించారు. దానిని ఒమోదించి ఇప్పటికి సరిగా ఆరు మాసములు కూడా కాలేదు. ఇంతలోనే మరల టాక్సు ఎక్కువ చేయాలని ఒక బిల్లు తెచ్చినారు. ఇది సమంజసంగా లేదు. ఏ ప్రభుత్వమైనా ఒక కొత్త టాక్సు వేయదలచుకొన్నప్పుడు దానిని ఒక సంవత్సరంకాని రెండు సంవత్సరాలు కాని experiment చేసి దానివల్లలాభం వచ్చిందాలేక నష్టంవచ్చిందా అనేవిషయాలను ప్రత్యక్షంగా చూచి ఆ మీదట దానిని చేస్తే బాగుంటుంది.

దీనిని Finance Minister గారు బాగా ఆలోచించమని కోరుచున్నాను. ఈ బిల్లులో "The following amendment shall be deened to have come into force on the 15 th June 1958" అని వున్నది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి.—Merchants కు లాభమేగాని గవర్నమెంటుకు లాభము కాదు.

శ్రీ కె. సీతయ్య గుప్త:—ఇది 8 మాసములకు ముందే అమలుకు వచ్చినప్పుడు దీనివల్ల లాభమే వచ్చినదో నష్టమేవచ్చినదో నాకు అర్థము కాలేదు. ఇది Merchants కు లాభమని చెప్పుతున్నారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి.— Coconuts, cotton yarn వలెకొన్ని declared goods క్రింద గవర్నమెంట్ఆఫ్యిండియా వారుచేశారు. దానిని మేముషెడ్యూలు క్రింద చేసి Retrospective effect యిస్తున్నాము. అందువల్ల Tax కూడ తగ్గుతుంది.

శ్రీ కె. సీతయ్య గుప్త:—దానిని నేను గ్రహించలేదు. ఒక్క Retrospective effect లోనికి మాత్రమే వస్తుందని నేనుభావించాను. అందువలన నాకేమి అభ్యంతరములేదు. నేను ఒకే amendment ను పంపినాను. దానిని Finance Minister గారు తప్పకుండా ఒప్పుకుంటారనిఅనుకుంటున్నాను. మరియు యిప్పుడు తవుడు, పొట్టు మొదలగు వాటికి వేరే tax వుండకూడదని శ్రీ జాలయ్య గారు చెప్పినారు. ఇదే విధముగా పప్పులు, Pulses మొదలగు వాటిమీద కూడ పన్ను వసూలు చేస్తున్నారు. అటువంటి దినుసులపై Double tax తీసి వేస్తారని మనవి చేస్తున్నాను.

శ్రీ బసవమానయ్య:— అధ్యక్షా; ఈ బిల్లు ప్రారంభములో పన్నును హెచ్చింపు చేసే బిల్లు కాదని ఆర్థిక మంత్రిగారు చెప్పినారు. అంటే పన్నులు కొంచెము హెచ్చిస్తారన్న మాట. ఈ బిల్లును ఎవ్వరూ యి క్కడ సమర్థించలేదు. యీ బిల్లు ఓటుకు వస్తే వారే గెలుస్తారన్న ధీమా వారికున్నది. 'కాకి పిల్ల యొక్క సౌందర్యాన్ని కాకే మెచ్చుకుంటుంది' యింక ఎవరు లోకములో దీనిని మెచ్చుకొనరు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— మేము Luxury articles మీదనే 7% వేస్తున్నామని చెప్పినాము. ఇతర వస్తువుల మీద యీ పన్ను హెచ్చింపు లేదు. మన కమ్యూనిస్టు పార్టీ సభ్యులు అయినటువంటి శ్రీ కె. సత్యనారాయణగారు 7% మాత్రమే ఎందుకు వేశినారు. ఇంకా ఎక్కువ ఎందుకు వేయలేదు? అమెరికా, ఇంగ్లండు మొదలైన దేశములలో ఎక్కువ పన్ను విధించబడుతున్నదని చెప్పినారు. అందుచేత యీ రెండు విధానాలలో ఏమి చేయమంటారో మీరే చెప్పండి.

*[Mr. Speaker in the Chair]*

శ్రీ బసవమానయ్య.—ఒంటె స్వరూపాన్ని సౌందర్యాన్ని యే విధముగా ఎవరూ పొగడరో, అదే విధముగా యీ ఒంటె స్వరూప లక్షణాలుకల యీ Sales tax బిల్లును గురించి యితర పార్టీలు విమర్శించడముకు వీలు ఏమి చేయలేవు. Sugar, పొగాకు, బట్టల మీద యే విధముగా కేంద్రమువారు మాత్రమే ఉత్పత్తి దారులపై Sales tax వేయడము, రాష్ట్రముతో వీటికి Sales tax మినహాయింపు యివ్వడము జరుగు చున్నదో చెప్పి యున్నారు. Luxuries articles మీద మాత్రము హెచ్చింపు చేసినట్టు చెప్పినారు Motar tyres tubes పైన మొదట 5% tax వుంటే యిప్పుడు దానిని 7% చేసినారు. అదేవిధముగా మోటారుసైకిల్సు, స్కూటర్స్, పై 5% నుంచి 7% వరకు, Refregirators మొదలగు వాటిపై 2% నుంచి 7% వరకు హెచ్చింపు చేసినారు.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:—కొన్ని కొన్ని వస్తువులకు General Sales tax వున్నది. అనగా ఆ వస్తువులు ఎన్ని సార్లు చేతులు మారితే అన్నిసార్లు 2% పన్ను యిచ్చుకోవాలి. అటువంటి వస్తువులకు Single Pint Sales tax వస్తువుల క్రింద పరిశీలించి యిప్పుడు 7% చేసినాము.

యిప్పుడు యీ బిల్లు వల్ల ప్రభుత్వానికి కూడ ఎక్కువ లాభము రాదు.

శ్రీ బసవమానయ్య.— Luxury articles 10 సార్లు అమ్మడం అంటూ వుండదు. యే ఒకటి రెండు సార్లు తప్ప యింకా ఎక్కువ సార్లు యీ వస్తువులు అమ్మ బడవు . అయిన ప్పటికి వీటిపై 7% Sales tax విధిస్తున్నారు. Sound Recording, Producing eqmi pement వాటిని కూడ 2% నుంచి 7% వరకు పెంచినారు. యిదే రీతిగా Photografhic articals పైన కూడ 2% నుంచి 7%, Wall clocks పైన 2% నుంచి 7% వరకు, అలాగుననే Iron, Steel, Type writers మొదలగు వాటిపైకూడ 2% నుంచి 7% వరకు పెంచినారు. బొంబాయి ప్రభుత్వములో 10% వరకుందని మొదలగు ఉదాహరణలు చెప్పినారు కూడ. కేంద్ర ప్రభుత్వముతో సంప్రదింపులు జరిపి రాష్ట్రాలు ఒప్పుకున్నాయని అన్నారు.

డాక్టర్ బి గోపాలరెడ్డి:— అన్ని ప్రభుత్వాలు కేరళ నుంచి కాశ్మీరు ప్రభుత్వమువరకు ఒప్పు కున్నాయి అని చెప్పినాను.

శ్రీ బసవమానయ్య:— శాసన సభలో యీవిషయమును గురించి బాగా యీ సంప్రదింపులన్ని గురించి ప్రస్తావించకుండా తాము చేసిన పనులన్నీశాసన సభలో నెగ్గించుకో గలమనే దీమాతో, భల్లూకపు పట్టుదలతో వారు వున్నారన్న సంగతి దేని వలన తెలుస్తున్నది మైకా, Mangonese మొదలగు ఇతర దేశములకు ఎగుమతి కాబడే వస్తువులపై ప్రభుత్వము శ్రద్ధ చూపలేదు. ఈ Sales Tax విషయములో అధికారుల ప్రవర్తనలో లోటుపాటులు వుండుట వలన వారు 'యిస్తిఫా' యిచ్చిన వివరాలు చాలా వున్నవి. వెండి పైన రెండు నయా పైసాలు బంగారం పైన 'హక్' నూటికి 0—8—0 అణాల చొప్పున వేయబడినట్లు యిందులో చెప్పబడింది. మీరు ఈ Sales tax సంబంధించిన లెక్కలు 4 సంవత్సరముల వరకు ఒకేసారి assessment చేసి యింత Tax అని విధించిన

తరువాత 4 సంవత్సరములు వరకు ఎప్పుడైనా చూడవచ్చునని ఒక క్లాజు వుంచినారు. ఉదాహరణకు ఒక వేళ పోలీసు ఎవరైన తప్పు చేస్తే Criminal Procedure Code క్రింద యే 30 రోజులో, 60 రోజులో appeal చేసుకొనడానికి time యివ్వబడింది కాని యీ Sales tax assessment విషయంలో 4 సంవత్సరముల వరకు పొడగించడము ఏమి న్యాయమో ఆలోచించ వలసి వున్నది. 1957వ చట్టంలోని 28వ విభాగంయొక్క 5వ ఉప విభాగంలో లెక్కలు, రిజిస్టర్లు ఇతరములు అనేదానికి బదులు సరుకులు, లెక్కలు, రిజిస్టర్లు అనేవాటిని చేరుస్తున్నారు. ఇదివరలో వ్యాపారమునకు సంబంధించిన లెక్కలను తణికీ చేయడానికి మాత్రమే అధికారముండేది. కాని ఇప్పుడు సరుకులను తణికీ చేయడానికి కూడా ఉద్యోగులకు అధికారమియ్య బడుచున్నది. రోజు రోజుకు ప్రభుత్వో ద్యోగుల అధికారాలు పెరిగి పోతున్నాయి. బహుశ ఉద్యోగుల సలహాలను బట్టి ఇట్టి సవరణలు తీసుకొని రావడం జరుగుతున్న దనుకుంటాను. ఒక గ్రామానికి సేల్స్ టాక్సు అఫీసరు వచ్చి లెక్కలు చూపించ మంటే వ్యాపారస్తుడు గడగడలాడుతున్నాడు. సేల్స్ టాక్సు పిశాచమంటే వర్తకులు హడలిపోతున్నారు. వర్తకులు సేల్స్ టాక్సు లెక్కలను ఎన్నో రకాలుగా తయారు చేయవలసువున్నది, ఎన్నో ఫారములు నింపవలసి ఉన్నది. వీక్లీ రిపోర్టు, మంతిలీ రిపోర్టు మొదలైన వెన్నో తయారు చేయాలి. బి. ఎ డిగ్రీకన్న తక్కువ విద్యార్హతలు కలిగినవారికి యీ లెక్కలు తయారు చేయడం కష్టమవుతున్నది. ఆంధ్ర ప్రాంతంలో ఇంగ్లీషు చదువుకొన్నవారు అధికంగాఉండవచ్చు. గాని తెలంగాణాప్రాంతంలో నూటికి ఒక్కరైనా ఇంగ్లీషు చదువుకున్నవారు లేరు. యీ లెక్కలు తెలుగులో వ్రాయరు. ఇంగ్లీషులో వ్రాయాలి. ఈ పరిస్థితులలో వర్తకులు ఎన్నో ఇబ్బందులు పడుతున్నారు. పూజ్యులు గోపాలరెడ్డిగారు ఎన్ని పన్నులు వేస్తున్నా అదాయం మాత్రం తగినంతగా పెరగడంలేదు. బియ్యం, జొన్నలు, రాగులు, వైదలు మొదలైన ఆహార ధాన్యాలపైనయినా అమ్మకం పన్ను లేకుండా చేయమని కోరుతున్నాను. పేద ప్రజలు అనునిత్యం వాడుకునే చిరుధాన్యాలపై పన్ను తొలగించడం మంచిది. రాగులను మన దేశంలోని పేదవారే తింటారు. పరాయి దేశాలకు అవి ఎగుమతి కావు. శ్రీ జాలయ్యగారు యీ బిల్లులో ఉన్న లోపనములు మనకు తెలియచేశారు. వారు తెలిపిన విషయాలన్నింటిని కూలంకషంగా చర్చించడానికి యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపితే బాగుంటుందని కూడా వారు అభిప్రాయ పడ్డారు.

శ్రీ టి. జాలయ్య:—అధ్యక్షా, సెలెక్టు కమిటీకి యీ బిల్లును పంపమని నేను చెప్పలేదు. అమ్మకం పన్ను విషయంలో సమగ్రమయిన శాసనాన్ని తీసుకుని రావడానికిగాను ఒక కమిటీని మాత్రమే వేయమన్నాను.

శ్రీ బసవమానయ్య:— జాలయ్యగారేమన్నారో అక్కడ కూరుచున్న రిపోర్టర్లు వ్రాస్తూనే ఉంటారు. ఆ రిపోర్టును పరికించమని వారిని కోరుతున్నాను. పరాయి దేశాలలో కొన్నివస్తువులు విమానాల మీద తెప్పించుకొని నూటికి నూరు పన్ను చెల్లిస్తామని శ్రీ జాలయ్య గారు చెప్పినప్పుడు ఎంతో సంతోష పడ్డారు శ్రీ గోపాలరెడ్డిగారు. ఐతే యీ నాడు తెలంగాణాలోని 5 వేల గ్రామాలలో 5 వేల కల్లు అంగళ్లు ఉన్నాయి. కాని ఆ మేరకు పాటశాలలు లేవు. పన్నులను విధించ వలసి వచ్చినప్పుడు పరాయి దేశాల సామ్యాన్ని చూపే మంత్రి వర్యులుపరాయి దేశాలలోని ప్రజలకు ఆ యా ప్రభుత్వము వారిచ్చిన సౌకర్యము లను కూడ జ్ఞప్తి యందుంచుకొనవలెనని కోరుతున్నాను. ఆ దేశాలలో గ్ర్యాడ్యుయేషను వరకు ఉచిత విద్యా సౌకర్యాలున్నాయి. ఐతే ఆ సౌకర్యాలను మనము కలుగ చేయము. పర దేశాలలో ప్రతి గ్రామంలోను పోస్టాఫీసు ఉంటుంది. తెలంగాణాలోని 5 వేల గ్రామాలకు 1000 లేక 1200 గ్రామాలలో మాత్రమే

పోస్టాఫీసులు ఉన్నాయి. మిగతా గ్రామాలలో లేవు. ఇంగ్లండు మొదలైన దేశాలలో హాస్పటలు లేని గ్రామమంటూ ఉండదు. కాని మా తాలుకాలోని 170 గ్రామాలకు ఒక హాస్పటలు మాత్రమే ఉన్నది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి:— అందరూ ఆరోగ్యవంతులని అనుకుంటాను.

శ్రీ బసవమానయ్య:— పన్నుల విషయం వచ్చేటప్పటికి సాదృశ్యాలు చూపే మంత్రి వర్యులు సౌకర్యాల విషయంలో కూడ సమానతను చూపాలి. ఆనాటికానాడు పన్నులు పెరుగుతున్నాయే కాని సౌకర్యాలు పెరగడంలేదు.

మిస్టర్ స్పీకర్ —నైజాం పరిపాలనలో పన్నులు వేయలేదు, సౌకర్యాలు చేయలేదని అంటున్నారు.

శ్రీ బసవమానయ్య:—నైజాం పాలన కాలంలో ఉండిన మంచి చెడ్డలను గురించి ఇప్పుడు వితర్కించి లాభములేదు. బాధ్యతాయుత ప్రభుత్వం కావలెనని పెద్దలు యం. నరశింగరావుగారు, కొండా వెంకటరంగా రెడ్డిగారు చేసిన బోధనలను అనుసరించి ఆంధ్ర మహా సభ ద్వారా పెద్ద పోరాటం జరిగింది. ఆ పోరాటం తరువాత శ్రీ వారి అధ్యక్షతన విశాలాంధ్ర కోసం ఉద్యమం సాగించాము. విశాలాంధ్ర వస్తే పన్నులు తగ్గులాయని ఆనాడు అందరు చెప్పేవారు. ఆంధ్ర ప్రాంతంలో తరి శిస్తు 12 రూపాయలు మాత్రమే ఉన్నదని తెలంగాణాలో 30 రూపాయలు ఉన్నదని యీ హెచ్చు శిస్తును ఆంధ్రలోని తరి రేటు స్థాయికి తగ్గిస్తారని అప్పుడు చెబుతూండేవారు. శ్రీ కాళేశ్వరరావుగారి అధ్యక్షతన సమావేశములు జరుగుచున్నప్పుడు శ్రీ సీతయ్య గుప్తగారు మమ్ములనుకూడ పిలిచారు. మా మ్యునిసిపాలిటీలుకూడా విశాలాంధ్రకు అనుకూలంగా తీర్మానాలు చేయవలెనని వారు చెబుతుండేవారు. మా జిల్లాలో మొట్ట మొదటగా ఆంధ్ర ప్రదేశ్ కావలెనని చెప్పినది నేను.

మిస్టర్ స్పీకర్:—పన్నులు లేకుండా సౌకర్యాలు చేస్తామని చెప్పారా ?

శ్రీ కె యల్ నరసింహారావు — విశాలాంధ్రను గురించి ఎన్నో పుస్తకాలు, కరపత్రాలు అచ్చు వేశారు. వాటిలో ఉన్నాయీ విషయాలన్ని.

శ్రీ బసవమానయ్య:—సేల్సు టాక్సు వసూళ్ల విషయంలో ఉన్న లోపాలను గురించి ప్రతి పక్ష సభ్యులే కాకుండా ప్రభుత్వ పక్ష సభ్యులుకూడా ఎన్నో సూచనలు చేశారు. వాటినన్నింటిని సమగ్రంగా పరిశీలించడానికి యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపడం అవసరం. ప్రతి బిల్లును పబ్లిక్ ఒపీనియన్‌కుగాని సెలెక్టు కమిటీకిగాని పంపమని సవరణ పెట్టడం చాలా సులువయిన పని అని అంటున్నారు. ఒక బిల్లును కూడ ప్రజాభిప్రాయానికి గాని సెలెక్టు కమిటీకిగాని పోనివ్వకుండా చేయడం దురుసు తనం అనిపించుకుంటుందేమో. 10 బిల్లులలో కనీసం యీ నాలుగు బిల్లులనయినా సెలెక్టు కమిటీకి పంపించి ఉదారత చూపించమని పూజ్యులైన గోపాలరెడ్డి గారిని ప్రార్థిస్తున్నాను.

శ్రీ ఈగూరు చిన్నప్ప: (మహబూబ్‌నగర్) :—మన ఆదాయంలో గల లోటును భర్తీ చేసకొనుటకై అమ్మకం పన్నును అధికం చేయవలెనని గత సంవత్సరం శ్రీ గోపాల రెడ్డిగారు కోరి నప్పుడు దానిని మన మందరం అంగీకరించాము. అయితే సేల్సు టాక్సు శాఖ పరిపాలన ఏ విధంగా ఉన్నదో మంత్రిగారి దృష్టికి వచ్చే వుంటుంది. ఈ లోపాల వల్ల ఒక వంక రయితుకు వేరొక వంక ప్రభుత్వముకు నష్టం కలుగు

తున్నది వర్తకులు కూడ ఎన్నో ఇబ్బందులకు లోను కావలసి వస్తున్నది. తెలంగాణా ప్రాంతానికి కూడా ఆంధ్ర శాసనం వర్తింప చేసిన తరువాత ఆహార ధాన్యాలపై పన్ను వసూలు చేయడం జరుగుతున్నది. ఒక కమిషను ఏజంటు వద్దకు రయితు ధాన్యం తీసుకొని వచ్చినప్పుడు ఆ ధాన్యం పై అప్పుడే సేల్సు టాక్సు వసూలు చేసి ఒక నెల రోజులలోపల దానిని కమిషను ఏజంటు సేల్సు టాక్సు ఆఫీసరుకు పంపే అలవాటు గనుక తెలంగాణాలో ఉండేది.

ఇది అమలులోకి వచ్చిన తరువాత కొన్న వాని పేరు మాత్రం నోట్ చేసుకొని, అది సేల్సు టాక్సు ఆఫీసరుకు తెలపాలి. ఈ మార్పు ప్రకారం అతడు లైసెన్సు తీసుకొన్న వాడుగా ఉండాలి. దీనివల్ల ప్రభుత్వమునకు నష్టము కలుగుటమేగాక వర్తకులు కూడా చాలా ఇబ్బందులకు లోనుకావలసి వస్తుంది. లైసెన్సు పొందిన వానికి మాత్రమే ఆ టాక్సు యివ్వాలి. వాని పేరు తెలిపితే అతని వద్ద సేల్సు టాక్సు ఆఫీసర్లు టాక్సును వసూలు చేసుకోవాలని ఉన్నది. ఒక లైసెన్సు దారు యివాళ లైసెన్సు పుచ్చుకొని ఆరు నెలల తరువాత దివాళా తీస్తాడు, లేక దురుద్దేశముతో సేల్సు టాక్సు మిగులుతుందని దివాళా పెట్టి వెళ్ళిపోతాడు, ఎక్కడికో పోతాడు. ఈ కమిషన్ ఏజంటు బాధ్యతగా అతను లైసెన్సు తీసుకొన్నాడా? లేదా? అతని పేరు తప్పా, ఒప్పా? అతను ఏ విశాఖపట్నంలోనో, రాయలసీమలోనో ఉంటే, అదంతా కనుక్కొని వ్రాయుట చాలా కష్టం. కాబట్టి లైసెన్సు దారు ఆరునెలలు టాక్సు ప్రోగు చేసుకొని ఏ రెండు వేల రూపాయిలయినా మిగులుతాయని దివాళా తీస్తే ప్రభుత్వానికి నష్టం. ఆ కమిషన్‌దారు అతని పేరు సరిగా చెప్పక పోయి నట్లయితే అతనిని చలాన్ చేసి కోర్టుకు ఎక్కించే అవసరం ఏర్పడుతుంది. ఇది ఒక కారణం. రెండవ దేమంటే రైతు వద్ద టాక్సు తీసుకొనకూడదు. వ్యాపారము చేసేవాని వద్దనే తీసుకోవాలని చెప్పది. ఒక గ్రామములో రైతు, ధాన్యాన్ని నేరుగా తెస్తాడు. లేక ఆ గ్రామములో చిన్న చిన్న వ్యాపారస్తునకు ఆ ధాన్యాన్ని అమ్ముతాడు. అటువంటప్పుడు అతడు యీ కమిషన్‌దారు వద్దకు తీసుకు వస్తాడు. గంజిలో వుండే కమీషన్‌దారునకు, యితను రైతా వ్యాపారస్తుడా అనేది నూటికి 99 మందికి తెలియదు. చాలమంది వర్తకులకు యీ విధంగా చిక్కులు ఉన్నవి. అది ఎక్కడో, ఎప్పుడో వారికి తెలియకుండా ఉన్నది. ఈ టాక్సు వేసుకోకపోతే తమ చేతులనుంచి కట్టవలసి వస్తుందనీ, వేసుకుంటే రైతుకు నష్టం కలుగుతుందనీ, ఏ విధంగా చెయ్యాలో తెలియుట లేదని సేల్సు టాక్సు ఆఫీసర్లను అడిగితే "మాకు తెలియదు, పుస్తకంలో యీ విధముగా ఉన్నది, తరువాత ప్రాసిక్యూషన్ కేసు వస్తే చూస్తాము, కావలిస్తే పుస్తకాలు చూసుకోండి, మేము సలహా యివ్వలేము" అని ఖచ్చితంగా చెప్తున్నారు. అందువల్ల యీ కమిషన్ ఏజంట్, రైతు వద్ద, వ్యాపారస్థుని వద్ద — అందరి వద్ద టాక్సు తీసుకొంటున్నాడు. ఈ విధంగ కూడా నష్టం కలుగుతోంది. ప్రజా స్వామ్యం అంటే పన్నులు వేయవలసినదే; ప్రభుత్వం నడిపించవలసినదే. గత్యంతరం లేదు. కాని మనం ఒక శాసనం చేసేటప్పుడు, అది అమలులో సక్రమంగా జరిగే పద్ధతి చూడాలి. అమలులో ఇబ్బందులు రాకుండా శాంతంగా ఆలోచించి చేయాలని ఆర్థిక మంత్రిగారిని కోరుతున్నాను. బట్టకు ఫ్యాక్టరీస్ వద్దనే వేస్తున్నారు. అదే విధంగా ఒక రెండణాలు ఎక్కువ వేసినా ఒక్కసారే వేస్తే బాధ ఉండదు.

తరువాత ప్రక్క రాష్ట్రంలో ఆహారధాన్యాలపై టాక్సు లేదు. మైసూరు స్టేటులో లేదు. రాయచూరుకు, వనపర్తి కొల్లాపురం నుంచి లారీల పైన ధాన్యం తీసుకు పోతారు. వాళ్లకు సేల్సు టాకు మిగిలితేనే చాలుననుకొంటారు. ఈ విధంగా దొంగ వ్యాపారం జరుగుతున్నది. పోలీసులకు లంచాలు యిచ్చి తీసుకుపోతారు. [illegible]

మనకు బడ్జెటు లోటు ఉన్నది కాబట్టి ఆహార ధాన్యాలపై టాక్సు కోరారు. కాని ఆహార ధాన్యాలపై మొదటలోనే ఏ కొద్ది టాక్సో వేయటంగాని, లేక తీసి వేయటంగాని ఆర్థిక మంత్రిగారు బాగా ఆలోచించి చేయాలని కోరుతూ ముగిస్తున్నాను.

శ్రీ టి. జి. తిమ్మయ్యశెట్టి (కోస్గి) :—అధ్యక్షా: ఈ అమెండ్‌మెంట్‌ను సెలెక్టు కమిటీకి పంప నవసరం లేదు. ఇదివరలోనే యీ అంశాలు ఉన్నబిల్లు సెలెక్టు కమిటీ ద్వారా పాస్ అయినది ఇప్పుడు తెచ్చిన అమెండ్‌మెంట్‌లో కొన్ని ఆర్టికిల్సు తగ్గించి పాస్ చేస్తే పర్వాలేదని నా అభిప్రాయం. ఇప్పుడు సైకిల్సు, సైకిలు పార్ట్సు యిందులో చేర్చారు.

డాక్టర్ బి గోపాలరెడ్డి :—సైకిల్సుకు కాదు, మోటారు సైకిల్సు, వాటి పార్ట్సు మాత్రమే యీ అమెండ్‌మెంటులో చేర్చాము.

శ్రీ టి. జి. తిమ్మయ్య శెట్టి —సరే. ఐరన్ సేఫ్స్, ఆల్మైరాలు, బీరువాలు జన సామాన్యం వాడతారు. ఇవి మన స్టేటులో చాలా చోట్ల తయారవుతున్నవి. Change of hands కూడ ఎక్కడ ఉండదు వాటికి multi point tax వేశారు. వాటి మీద ఎక్కువ ఆదాయం ఉండదు. అందువల్ల దానిని 2% చేసి సింగిల్ పాయింట్ పెట్టితే బాగుంటుందని నేను కోరుతున్నాను. సత్యనారాయణగారు constructive గా కొన్ని విషయాలు చెప్పారు. అని ప్రభుత్వం గమనించ తగినవి. Act ను బిగించారని అందువల్ల Loop holes తగ్గినవని అన్నారు. అది నిజమే. మద్రాసు స్టేటుతోగాని, మైసూరు స్టేటుతోగాని పోలిస్తే lapses గాని, పొరపాట్లుగాని మన స్టేటులో చాలా తక్కువ అని తెలుస్తున్నది. కాని దేనికైనా వ్యాపారస్తులను శిక్షించడానికి యాక్టులో బిగించినారు, ఆఫీసర్సును శిక్షించడమనేది లేదు. చాలా చోట్ల representation వచ్చినవి. Sales Tax Officers అన్యాయంగా ప్రవర్తిస్తున్నారని, అటువంటి వారిమీద చర్య తీసుకొనుటకు C. I. D. లాంటి supervisory staff ఉండాలని నేను కూడ కోరుతున్నాను వ్యాపారస్థులే దొంగలు అనటం బాగుండదు పొరపాట్లు, తప్పులుఉద్యోగస్తులలోనూ ఉంటాయి, వ్యాపారస్థులలోనూ ఉంటాయి వ్యాపరస్తులను మాత్రమే యిరికించి , ఉద్యోగస్తులవల్ల తప్పు ఉంటే వారి మీద చర్య తీసుకొనకపోవటం సరైన పద్ధతికాదు అటువంటి ఉద్యోగస్తులను ప్రభుత్వం శిక్షిస్తుందని అంటేగాని వారుకూడా సక్రమం గా ప్రవర్తించరు. వారి మీదకూడ ఒక కన్ను ఉంచాలని నేను ప్రభుత్వమును కోరుతున్నాను.

వెండి సామానుల విషయంలో అది bullion క్రింద ఉన్నది. తట్టలుగాని, కప్పు సాసర్లుగాని, జనరల్ సేల్సు టాక్సు ఆక్టు క్రింద 1936 నుంచికూడ bullion క్రింద ఎంచుకోబడి నాలుగణాలు గాని, ఎనిమిదణాలుగాని, వెండి క్రింద లెక్క పెట్టి ఆ ప్రకారం Sales Tax విధించేవారు— ఇప్పుడు కొత్తగా ఒక సి. టి. ఒ. గారు దానిని నగల క్రింద లెక్క పెట్టి, దానికి 2 పర్సెంటు ఎసెస్ చేయాలని చెప్పినందుకు, ఇంత గొడవ ఏర్పడినది. ఈ రాష్ట్రంలో వ్యాపారస్తులు అందుకు చాలా ప్రొటెస్టు చేస్తున్నారు. వెండివస్తువులవల్ల ప్రభుత్వానికి ఎక్కువ ఆదాయంకూడఉండదు. కాబట్టి దానినిబులియన్ క్రిందనే ఎంచాలని కోరుతున్నాను. బులియన్‌కు నూటికి 8 అణాలు ఉండేదానిని, నాలుగు అణాలకు తగ్గిస్తా మని గోపాల రెడ్డిగారు సెలెక్టు కమిటీలో చెప్పారు. కాని ఇంత త్వరలోనే వెండి సామానులు కూడ దాని క్రిందనే లెక్క కట్టుకొని 8 అణాలు చేయటం సమంజసం కాదని నా అభిప్రాయం. బులియన్ వ్యాపారం

మీద మనం టాక్సు ఎక్కువ చేస్తే, అది వర్తకులకు గిట్టదు. వారి మీద ఎక్కువ పన్ను వేస్తే వారు తప్పు పని చేయటానికే ప్రభుత్వమే త్రోవ చూపినట్లు అవుతుంది. కాబట్టి బులియన్ విషయంలో 8 అణాలు చేయకుండా, 4 అణాలకే ఉంచి వెండి సామానులను కూడ దాని క్రిందనే లెక్క చేస్తే బాగుంటుందని కోరుతున్నాను

ఐరన్—ఒర్ మీద టాక్స్ పెంచ వచ్చునని సత్యనారాయణగారు అన్నారు. కాని, ఐరన్--ఒర్ ప్రభుత్వమే స్వాధీనం చేసుకొంది. ఐరన్-ఒరుసు స్టేట్ ట్రేడింగ్ కార్పొరేషన్ ఎక్స్‌పోర్టు చేస్తోంది. అటువంటప్పుడు దాని మీద మనకు ఎక్కువ ఆదాయం వచ్చేదానికి వీలులేదు దాని లాభం సెంట్రల్ గవర్న మెంటు తీసుకొంటోంది. అందులో కొంత భాగం మన ప్రభుత్వానికి ఇస్తోంది.

శ్రీ పి. సత్యనారాయణ:—మన "కోల్" తాతా బిర్లాస్ లాంటి పెద్ద పెద్ద ఫ్యాక్టరీలవారు వాడు తున్నారు. వాళ్ల మీద టాక్స్ బాగా వేయవచ్చును గదా ?

శ్రీ టి జి. తిమ్మయ్య శెట్టి:— అప్పుడుకూడ ప్రొడక్షన్ లెక్కపెట్టాల్సి వస్తుందండి. ప్రొడక్షన్ మీద, అవుట్ టరన్ మీదలెక్క కట్టి, అన్ని రకాలుగా టాక్స్ పెంచితేనే ఎరిపోతోందిగాని, తాతా బిర్లాన్‌లాంటి వాళ్లు వాడుతున్నారని టాక్స్ పెంచితే, కన్‌జ్యూమర్స్ గూడ్స్ ధరలు కూడ పెరుగు తాయి. అందువల్ల వాటిపై టాక్స్ పెంచాలంటే, ఇంటర్‌నేషనల్ మార్కెట్ చూడవలసి ఉంటుంది.

ఈ సేల్సు టాక్స్ ఆఫీసర్లు లెక్కలు సరిగా వ్రాయటం లేదని చిన్న చిన్న వర్తకులను సతాయించటం జరుగుతోంది. అన్ని పదార్థాలమీద టాక్స్‌ను సింగిల్ పాయింట్ టాక్స్‌గా కన్‌వర్ట్ చేస్తే బాగుంటుంది. అప్పుడే లెక్కలు సరిగా వ్రాయలేదని చిన్న చిన్న వర్తకులను ఆఫీసర్లు సతాయించటం పోతుంది. కాబట్టి, సాధ్యమైనంతవరకు అన్ని పదార్థాల మీద టాక్స్‌ను సింగిల్ పాయింట్ టాక్సు క్రింద మార్చాలని కోరుతున్నాను.

*శ్రీ కె. యస్. నరసింహారావు:— మిస్టర్ స్పీకర్ సర్, ఇవాళ సేల్సు టాక్స్ అమెండ్‌మెంట్ బిల్లు మన ముందర డిస్కషన్‌కు ఉన్నది. ఈ బిల్లును సెలెక్ట్ కమిటీకి పంపించవలెను అన్న ప్రొపోజల్‌ను కొంత మంది సమర్థిస్తూ, మరి కొంత మంది వ్యతిరేకిస్తూ మాట్లాడారు. ఈ ప్రొపోజల్‌ను వ్యతిరేకిస్తూ కొంత మంది యీ విధంగా చెప్పారు. "ఈ అసెంబ్లీ ఏర్పడిన తర్వాతనే సేల్సు టాక్స్‌కు సంబంధించిన సమగ్రమైన యాక్టు మన ముందుకు వచ్చింది. అప్పుడు దీనిని క్లాజు బై క్లాజు చర్చించాము; దీని మంచి చెడ్డలన్ని ఇదివరకే పరిశీలించాము ఈ ప్రభుత్వానికి ఇష్టమున్నా, లేక పోయినా సెంట్రల్ గవర్నమెంటు వారి వత్తిడివల్ల కొన్ని క్లాజులకు అమెండ్‌మెంట్లు తీసుకు వచ్చారు. దీని వల్ల సెంట్రల్ గవర్నమెంటుకు లాభకరంగా ఉంటుంది గాబట్టి, యీ అమెండ్‌మెంట్లు స్టేటు గవర్నమెంటు తీసుకు వస్తున్నది. అందువల్ల యీ సవరణలను అంగీకరిస్తే యీ బిల్లును సెలెక్టు కమిటీకి పంపిం చనక్కరలేదు," అని సెలెక్ట్ కమిటీకి పంపించాలనే ప్రపోజల్‌ను వ్యతిరేకించిన వారుచెప్పారు. ఎవరికి వారికి అట్లాగే ఉంటుంది. మేము ఇచ్చిన అమెండ్‌మెంట్లను మినిస్టరుగారు ఒప్పుకోవటానికి సిద్ధ పడితే యీ బిల్లును సెలెక్ట్ కమిటీకి పంపనక్కరలేదని మేముకూడ చెప్పుతాము. ఇప్పుడు అదికాదు సమస్య. ఈ బిల్లుకు మెరుగులు దిద్దటానికి అవకాశం ఉంటుందనే ఉద్దేశంతో దీనిని సెలెక్ట్ కమిటీకి పంపించాలని కోరుతున్నాము. "నేను పెట్టిన అమెండ్‌మెంటును ఒప్పుకోండి, సెలెక్ట్ కమిటీకి దీనిని పంపించాలనే తీర్మా

నానికి నేను వ్యతిరేకంగా ఓటు చేస్తాను'' అనే ధోరణిలో ఆలోచించటం సరైనది కాదు. ఈ సేల్సు టాక్సు చట్టానికి ఒకసమగ్రమైన స్వరూపం ఉండవచ్చుగాక. ఈ బిల్లును ఒక్క అపోజిషన్ పార్టీ మాత్రమే వ్యతిరేకించటం లేదు, అందరూ వ్యతిరేకిస్తున్నారు, అన్న విషయం స్పష్ట పడింది. దీనిని రైతులు వ్యతిరేకిస్తున్నారు. అన్నము తినేవాడు వ్యతిరేకిస్తున్నాడు. అన్నము అమ్మేవాడు వ్యతిరేకిస్తున్నాడు. అన్నము తినేవాడికి అన్నం ఉత్పత్తి చేసే వాడికి మధ్యఉండి లాభాలు సంపాదించే మధ్యవర్తికూడా వ్యతిరేకిస్తున్నాడు. అందరూ దీనివల్ల బాధలుపటడుతున్నామంటున్నారు. చిన్నవాడుకానివ్వండి, పెద్దవాడు కానివ్వండి, లక్షలు ఆర్జించేవాడు కానివ్వండి, రెండురూపాయలు సంపాదించేవాడే కానిండి, అందరుకూడా యీ బిల్లునువ్యతిరేకిస్తున్నారు. ఈ యాక్టువల్ల ఉద్యోగులకు వ్యాపారస్థులకుమధ్య ఏర్పడుతున్న సంబంధాలవల్ల, ఉద్యోగస్తులు తమ అధికారాలు తప్పుడుగా ఉపయోగించటంవల్ల అనేక చిక్కులు ఏర్పడుతున్నాయి. పెద్ద వర్తకులైతే నాలుగు డబ్బులు ఇచ్చి, ఆ ఉద్యోగస్తులు పెట్టేచిక్కులనుండి తప్పించుకొంటున్నారు. తమకు వచ్చే లాభాలనుండి ఒక పర్సెంటో, రెండు పర్సెంటో ఆ ఉద్యోగుల కొరకు ప్రత్యేకిస్తూ ఉంటారు.

ఇప్పుడు సత్యనారాయణగారు చెప్పినట్లు, పల్లెటూల్లో ఒక చిల్లర వర్తకుడు ఉంటాడు. అతడు 50, 60 రకాల వస్తువులు అమ్ముకొంటూ ఉంటాడు. హైదరాబాదు సిటీలో మాదిరిగా ఒక్కొక్క రకం వస్తువుకు ఒక్కొక్క దుకాణం పెట్టుకొనే పరిస్థితులు పల్లెటూళ్లలో ఉండవు. అన్ని రకాల వస్తువులు ఒకే దుకాణంలో పెట్టుకొని అమ్ముకోవలసిన దశలో అక్కడి వర్తకుడు ఉంటాడు. అట్లా అమ్ముకొన్నప్పుడే అతడు తనబార్య బిడ్డలకు బువ్వపెట్టుకొనే స్థితిలో ఉంటాడు.అట్లుగాక, ప్రతి రకానికి ఒక్కొక్కదుకాణంపెట్టుకొంటే,అతడుఖర్చుపెట్టినపదిరూపాయలకుఒకసంవత్సరంఅయ్యే టప్పటికియింకో పది రూపాయలు సంపాధించుకోటానికి బదులు, ఆ పది రూపాయలు 8 రూపాయలై, 7 రూపాయలై చివరకు అతని వ్యాపారం దివాళా తీసే పరిస్థితి ఏర్పడుతుంది. అనేక రకాల వస్తువులు వ్యాపారం చేసే వ్యక్తికి యీకొత్త చట్టంద్వారా అనేక బాధలు ఏర్పడుతాయి. పాత యాక్టు ప్రకారం వ్యాపారస్థుని లెక్కల పుస్తకాలు మాత్రమే స్వాధినం చేసుకొనే అధికారం ఆఫీసర్సుకు ఉన్నది. ఇప్పుడు యీ కొత్త చట్టం ప్రకారం గూడ్సుకూడ సీల్ చేసే అధికారం అధికారులుకు ఇస్తున్నారు. అధికారులు వ్యాపారస్థుల పుస్తకం తీసుకొంటే "యీ పుస్తకం ముట్టినది, దీంట్లో ఇన్ని పేజీలు ఉన్నవి.''అని వ్రాసి ఇవ్వ వలసిన అవసరం ఉంటుంది. అదే విధంగా గూడ్సుకూడా తీసుకొంటే "ఎంత తీసుకొన్నారు" అన్న లెక్కలన్నీ ఇవ్వ వలసిన అవసరం ఉన్నది. ఆఫీసర్సు తీసుకొనే యీ 50 రకాల వస్తువులు తిరిగి తూచి అప్పగించటం సాధ్యం అయ్యేది కాదు. ఆ ఆఫీసర్సు వ్యవహారం పరిష్కారం చేసేలోపల, ఆ సరుకంతా చెడిపోవటమో, ఎలుకలు తినటమో, జరిగి తరుగుదల ఏర్పడవచ్చును. ఈ బాధలన్నీ పడలేక వ్యాపారస్తులు ఆఫీసర్సుకు కట్నం ఇచ్చుకొని తమ సమస్యను పరిష్కారం చేసుకొనే పరిస్థితి కల్పిస్తున్నారు. అటువంటి నిర్బంద పరిస్థితులలోకి ఆ షావుకార్లను యీ ప్రభుత్వం పడేస్తోందన్న మాట. ఉద్యోగులకు అధికారాలు ఇస్తున్నప్పుడు మనం జాగ్రత్తగా ఆలోచించాలి. మనము బాధ్యతలేని కొంత మంది వ్యక్తులకు అధికారాలు అప్పగిస్తే, దానివల్ల ఎంతమంది బాధ పడుతున్నారో, ఇంకా ఎంతమంది బాధపడే అవకాశాలున్నాయో, పరిశీలించవలసిన భాద్యత అవసరం మనందరికి ఉన్నదని నేను అనుకొంటున్నాను. ఇవాళ మినిస్టర్సు దేశ పరిస్థితులను అర్థం చేసుకొని, సౌమ్యంగా ప్రవర్తించటానికి అలవాటు చేసుకొంటున్నామని అనుకొంటున్నారో, అట్లాగే ప్రతి ఉద్యోగి అలవాటు చేసుకొంటున్నాడని ఆశించటానికి వీలులేదు. వారు బురాక్రెటిక్ గవర్నమెంటు క్రింద పరిపాలన చేస్తూ, అధికారాలు చెలాయిస్తూ వచ్చారు. వాళ్లు దానికి అలవాటు పడ్డారు. అందుకని వాళ్లలో

బ్యూరాక్రెటిక్ లక్షణాలన్నీ పోయాయని అనుకోకుండా, క్రమక్రమంగా వాళ్లలో యీ బ్యూరాక్రెటిక్ పద్ధతులను పోగొట్టటానికి ప్రయత్నించవలెను గాని, వాటిని వెంటనే పోగొట్టవలెనని అనుకోవటానికి వీలు లేదు. ఇండిపెండెంట్ మూవ్‌మెంట్స్‌లో, అనేక ఉద్యమాలలో పాల్గొని, వాటిని నిర్వహించిన వారే, బ్యూరాక్రసీని తమ సొంతసొత్తుగా అలవర్చుకొంటున్నప్పుడు, అసలు ఆ ప్రభుత్వం క్రిందనే పనిచేసే వాళ్లను గురించి మనం అనుకోవలసిన అవసరం లేదు. "అన్నింటికి 7 పర్సెంటు వేశారేమండి, ఇదంతా అసహ్యంగాఉంది, ఇంకా వంద పర్సెంటుఎక్కువ చేస్తే మాత్రం నష్టం ఏమిటి," అని సత్యనారాయణ గారు అన్నారని మంత్రిగారు చెప్పారు నేను సత్యనారాయణ గారిని అడిగినాను. 15 రకాల ఆర్టికిల్సు ఉన్నాయి, అన్నింటికీ ఆ విధంగా పెంచలేక పోయినారా అని వారు చెప్పలేదు. ఆ రీతిగా వారి అభిప్రాయం కాదని నేను హౌస్‌కు తెలియజేస్తున్నాను. మోటార్స్, రిఫ్రిజిరేటర్లు ఉన్నవి. ఇవి సాధారణ ప్రజలు ఉపయోగించేవి కావు. సామాన్య ప్రజలు కొనుక్కోవటానికి అందుబాటులో ఉండేవికావు అవి. లక్షాధికార్లు, బాగా డబ్బు ఉన్నవారు, ధనవంతులు మాత్రమే వాటిని కొనగలరు. అటువంటి వాటిమీద ఇంకా పన్నులు పెంచే అవకాశాలున్నాయి. ఆ విధంగా పన్నులు పెంచి స్టేటుకు లాభం చేకూర్చటానికి మినిస్టర్‌గారు ఆలోచిస్తే బాగుండేది —అని సత్యనారాయణగారు అన్నారు. కాని ప్రభుత్వం ఇచ్చిన లిస్టులో సాధారణ ప్రజలు ఉపయోగించే వస్తువులు కూడ ఉన్నాయి. . . . . . . . . . .

మిస్టర్ స్పీకర్:—రెండు నిమిషాలలో పూర్తి చేయండి.

శ్రీ కె. యల్. నరసింహారావు:— ప్రభుత్వం ఇచ్చిన పట్టికలో 15 వస్తువులు ఉన్నవి. వాటి అన్నింటి గురించి నేను మాట్లాడ వలసి ఉన్నది.

మిస్టర్ స్పీకర్:—రేపు మూడు గంటలకు మనం తిరిగి సమావేశం ఔదాము. మూడు గంటల నుండి నాలుగు గంటల వరకు క్వశ్చన్ అవర్ ఉంటుంది. 4 గంటలకు బడ్జెటు ప్రవేశ పెట్టబడుతుంది. ఎల్లుండి 27వ తారీకున ఇది తిరిగి టేకప్ చేద్దాము. రేపు మూడు గంటల వరకు యీ సభను వాయిదా వేయడమైనది.

The House then adjourned till Three of the Clock on Wednesday, the 26th February, 1958.

